# పరబ్రహ్మ స్తోత్రమ్



రచయిత

## వద్దిపర్తి కోనంరాజు

**Retd. Senior Accounts Officer**

**S.E.Rly.**



ప్రచురణ కర్త

రచయిత తృతీయపుత్రుడు

వద్దిపర్తి రాజేశ్వరరావు

**New Jersey, U.S.A.**

మొదటి కూర్పు 500 ప్రతులు

విశాఖపట్నం,

28-2-1999.

# పరబ్రహ్మ స్తోత్రమ్

రచయిత

## వద్దిపర్తి కోనంరాజు

**Retd. Senior Accounts Officer**
**S.E.Rly.**



ప్రచురణ కర్త
రచయిత తృతీయపుత్రుడు
వద్దిపర్తి రాజేశ్వరరావు
**New Jersey, U.S.A.**
మొదటి కూర్పు 500 ప్రతులు

# కృతజ్ఞతలు

బ్రహ్మశ్రీ గంటి అప్పలనరసింహం (Retd. Telugu Pandit, St. Anthony High School, Visakhapatnam) గారు శ్రమయనుకోకుండ ఈ స్తోత్రము యొక్క వ్రాత ప్రతినిచూచి సరిదిద్ది ముద్రణా యోగ్యము చేసినారు. వారి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధి నిమిత్తము ఆ పరమేశ్వరుని ప్రార్థించుచూ ఇందు మూలముగా వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేయుచున్నాను.

దీనిని ముద్రించిన M/s Ramya Printers & Binders వారికి గూడ నా కృతజ్ఞతలు తెలుపుచున్నాను.

ఇట్లు
వద్దిపర్తి కోనంరాజు
రచయిత



రచయిత తండ్రి గారగు
వద్దిపర్తి వేంకటరెడ్డి పంతులుగారు
(1867నుండి 1951 వరకు)

తల్లిగారగు
పేరిందేవిగారు



రచయిత
కోనంరాజుగారు

వారిసతీమణి
నర్సమాంబగారు

## సంకేతాక్షర సూచి

| | |
|---|---|
| సూ | సూచన |
| గీత | భగవద్గీత |
| శ్లో | శ్లోకము |
| తా | తాత్పర్యము |
| మం | మంత్రము |
| ర.కృ. | రచయిత కృతము |
| మ.ల.ప | శ్రీమహాలక్ష్మీపరిణయము } రచయిత ప్రప్రపితామహవిరచితము |
| వేం. ఉ. | శ్రీ వేంకటేశ్వరోపాఖ్యానము } రచయిత ప్రప్రపితామహవిరచితము |
| మ.ప్ర.శ. | మహాప్రభుశతకము (రచయిత పితామహాగ్రజ విరచితము) |
| జ్ఞా.సా. | జ్ఞాన సాధనము (రచయిత పితృకృతము) |
| హే.కుం. | హేమకుంభము (రచయిత భాతృకృతము) |
| తి.తి.దే.ప్ర. | తిరుమల తిరుపతి దేవస్థాన ప్రచురణ |
| క.ఠ. | కఠోపనిషత్తు |
| ముం. ఉ. | ముండకోపనిషత్తు |
| బ్రహ్మ | బ్రహ్మానందవల్లి |
| కేన. | కేనోపనిషత్తు |
| శాం. ఉ. | శాండిల్యోపనిషత్తు |
| వివే | వివేకచూడామణి |

## విషయసూచి



మాతాతగారికి తాతగారును, 18 వ శతాబ్దమునకు చెందిన వారును, వద్దిపర్తి వంశవర్ధనులును, మహాభక్తులును, అద్భుత దివ్యశక్తి సంపన్నులును అగు కోనం రాట్క్వీంద్రుని దివ్య శక్తి సంపన్నతను తెలుపు సంఘటన లిందు పొందుబరచబడినవి.

శ్రీరస్తు　　　　　శుభమస్తు　　　　　అవిఘ్నమస్తు

ఓం నమో భగవతే వాసుదేవాయ

## విజ్ఞప్తి

సుజనులారా!

ఈ కృతిని నేను ధనార్జన నిమిత్తము ప్రచురించుటలేదు. అయితే ధర నిర్ణయించకుండా ఉచితముగా అందరికీ పంచిన యెడల దీనిమీద ఎవ్వరికినీ శ్రద్ధ యుండక పోయి ఏదో యొక మూలను పడేస్తారు. ధర యిచ్చికొనిన యెడల దీనియందు కొద్దిగానైనను శ్రద్ధ జనించి చదివి గ్రహించి ఎవరైనను తరించెదరన్న యాశతో దీనివెల తక్కువలో తక్కువగా రు. 10 / - (పది రూపాయలు) అని నిర్ణయించడమైనది.

దీనివలన వచ్చిన ఆదాయమును నేను రచించిన భగవద్గీతా శంకర భాష్యానువాదమును ముద్రింపజేయుటకు వినియోగించబడును. దాని వలన వచ్చు ఆదాయము సద్వినియోగమే చేయబడును.

**విశాఖపట్నం,**　　　　　ఇట్లు
**26-1-99.**　　　　　సుజన విధేయుడు
వద్దిపర్తి కోనంరాజు

# ఓం నమో శ్రీ వేంకటేశ్వరాయ
## శ్రీ గురుభ్యోనమః
## ఇష్టదేవతా ప్రార్థన

గీ॥ సిద్ధి బుద్ధులన్ గూడిన ♦ గణపతి గొలు
వ మమ కార్యమున గలుగు ♦ విఘ్నముల్ తొ
లగు నంత ఉమాతనయు కతి ♦ కరుణ గలుగ
మత్కృత స్తోత్ర ఫలమును ♦ గనుట నిజము ॥ ర.కృ.

ఆ.వె॥ విష్ణు పద్మనాభ ♦ మాధవ గురుతమ
అప్రమత్త ఉద్భ ♦ వ యరవిన్ద
నిన్ను జూడగంటి ♦ నీ కృప గనగొంటి
అఖిల సౌఖ్యపదవి ♦ నందగొంటి ॥ ర.కృ.

ఉ. ॥ కాలము కాలుండేను లయ ♦ కారుండు కైరవ మిత్ర మిత్రది
గ్జాల నిలింప మౌనిజన ♦ పన్నగ దానవ మానవాది భూ
తాళి జగంబు లాగమము ♦ లారయ నెవ్వని లీలనైతి మా
శ్రీ లలనా మనోహరుని ♦ జేరి భజింతము చింతలేటికిన్॥

మ.ల.ప.2.31

ఉ.॥ లోకము లేమహాప్రభుని ♦ లోలతఁ బుట్టి సమృద్ధి నొందునో
లోకము లేపరాత్పరుని ♦ లోకన శక్తిలయంబు నొందునో
లోకము లేవిరాట్పురుషు ♦ లోన వెలుంగుచు నిండియుండునో
యా కమాలాక్షుఁడనఁతుడు ♦ మాకుఁ బ్రసన్న మయ్యెడున్॥

మ.ల.ప 2-35

ఉ॥ ఎవ్వఁడు నిష్కళంకుఁడగు ♦ నీశ్వరుఁడెవ్వఁడు విశ్వ నాయకుం
డెవ్వఁడు యోగి హృన్నిలయుఁ ♦ డెవ్వఁడు కారణకార్యకర్త తా
నెవ్వఁడు మూలకందమయుఁ ♦ డెవ్వఁడు సత్త్వగుణ ప్రధానుడౌ
నెవ్వఁడు గణ్యుఁడట్టి జగ ♦ దేకమహావిభుఁగొల్తుమెంతయున్ ॥

మ.ల.ప. 2-36

డఖిల జీవాత్ముఁడై ♦ యిలరాయ నెవ్వాఁడు
మూఁడు మూర్తుల కాది ♦ మూలమెవ్వఁ
డవ్య యాధ్యాత్మబో ♦ ధానందుఁడెవ్వఁడు
మోక్ష ప్రధానుఁడై ♦ మొనయు నెవ్వఁ
డమిత పద్మాసనా ♦ ద్యారాధ్యుఁడెవ్వాఁడు
భక్తరక్షణ కళా ♦ భవ్యుఁడెవ్వఁ

గీ॥ డట్టి వైకుంఠనాథున ♦ కక్షరునకు
విహగపతి యాను నకు విరా ♦ డ్విగ్రహునకు
శ్రీఘ్రగతిఁ దోఁచి మమ్మర ♦ క్షించుకొఱకు
వరుసఁగావించెదము కోటి ♦ వందనములు ॥ మ.ల.ప.2.

7. సీ॥ ధరణిపాదములునే ♦ త్రములు సూర్యేందులు
ముఖమగ్ని రోమము ♦ ల్మునులు సురలు
స్తోత్రముల్దిక్కులు ♦ సోముండు చిత్తంబు
గగనంబు మూర్ధంబు ♦ కమలజుండు
హర్షంబు రుద్రుండ ♦ హంకారమంబుధుల్
రేతస్సు లరయని ♦ ంద్రియ చయంబు
లామ్నాయములు తత్త్వ ♦ మంగంబు విశ్వంబు
కుక్షిధర్మంబు వ ♦ క్షోరుహములు

గీ॥ ప్రణవ మాత్మయు గుహ్యంబు ♦ బ్రహ్మమగుచు
మూఁడు మూర్తుల కెల్లను ♦ మొదలివెంకి
వై ప్రకాశించు నీకు ని ♦ రంతరంబు
వందనము లాచరింతుము ♦ వనరుహాక్ష ॥ మ.ల.ప. 2-

8. శా॥ శ్రీమద్రాజత శైలపంకజ ఫణి ♦ క్రీడా నిశాంతాద్రిజా
శ్రీమాప్రాంచ దురోజ సాంకవమద ♦ శ్రీపత్రసువ్యక్త వ
క్షో మధ్యాతత రత్నహార విలస ♦ త్కుంభిఘ్నధాత్రాచ్యుత
త్రై మూర్త్యాత్మక రామనామక పర ♦ బ్రహ్మంబు సేవించెదన్ ॥
వేం. ఉ. 1

9. సీ॥ శ్రీధరుల కలంక ♦ చిన్మయాకారులు
ప్రణవ స్వరూపులు ♦ పరమధాము
లబ్జలోచనులు ధ ♦ రాత్మజాత్మేశులు
వేదాంతవేద్యులు ♦ విశ్వమయులు
నిర్జితకాములు ♦ నిఖిల లోకేశ్వరు
లఘసంహరులు సంత ♦ తాబ్జధరులు
ఘనసారనిభగాత్రు ♦ లనుపమ తేజులు
పురుషోత్తములు సర్వ ♦ భూతపతులు

గీ॥ నిర్గుణ బ్రహ్మమూర్తులు ♦ నిర్వికారు
లభవులక్షరు లాది మ ♦ ధ్యాంత రహితు
లైన శివకేశవులు మదీ ♦ యాత్మ నిలిచి
కరుణదళుకొత్తఁబ్రోతురు ♦ త్కాలిక తోడ॥ వేం. ఉ.

10. సీ. మిసిమి బంగరుతేట ♦ మెయితళుక్కన పాల
మున్నీటఁబుట్టిన ♦ మోహనాంగి
యలఘు నిత్యవిభూతి ♦ నలరారు హరి ముద్దు
పట్టంపు రాణియౌ ♦ పద్మగంధి
దివ్య వైకుంఠ మం ♦ దిరల సద్భోగి త
ల్పంబు నశయనించు ♦ పల్లవాంఘ్రి
పలుకు వాల్గంటి కొం ♦ డల రాచలేఁబట్టి
తోడ నాడెడు పూవుఁ ♦ బోఁడిమిన్న

గీ॥ పద్మగర్భపులో మజా ♦ ప్రాణనాథ
వందిత పదారవింద పూ ♦ ర్ణేందువదన
యైన శ్రీవైష్ణవీరత్న ♦ మాదిలక్ష్మి
మించు వేడుక మమ్మర ♦ క్షించు గాత॥ వేం. ఉ.

11. ఉ. శ్రీహరివాసుదేవ సర ♦ సీరుహ పత్ర విశాలనేత్ర ల
క్ష్మీహృదయేశ మౌనిజన ♦ చిత్త సరోజమిళిందలోక దృ
క్సోహమనే ద్వియక్షరవి ♦ శుద్ధ మహోజ్వలతేజసావసం
దోహ మహాటవీదహన ♦ దుర్మదభంజన శ్రీమహాప్రభో ॥ మ.ప్ర.శ

12. ఉ. బ్రహ్మను భారతీరమణు ♦ బ్రస్తుతిజేసెద నెల్లవేళలన్
జిహ్మగతల్పు మాధవు భ ♦ జింతున జస్రము నెమ్మదిన్ శివ
బ్రహ్మము పార్వతీశ్వరుని ♦ ప్రార్థన జేసెదనాత్మ శ్రీ పర
బ్రహ్మమవీవటంచునతి ♦ భక్తి భజించెద శ్రీ మహాప్రభో॥ మ.ప్ర.శ. 12.

13. శా॥ శ్రీ సింహాచల మందిరంబున సుఖా ♦ సీనుండవై మోక్షల
క్ష్మీసంభోగ విలాస సంపదలచే ♦ జెన్నొందు నిన్నాత్మలో
నే సేవించెద భక్తి ముక్తి కొఱకై ♦ నిండారు మోదంబుతో
నీసాయుజ్యమొసంగి బ్రోవగదవే ♦ నిత్యప్రమోద ప్రభో॥ మ.ప్ర.శ.87

14. కీర్తన॥ శ్రీరామ రఘురామ । సీతాపతేరామ।
సుజన పోషకరామ । సుగుణాభిరామ॥ శ్రీ రామ ॥
అఖిలాండ కోటీ బ్రహ్మాండనాయకరామ ।
అంతరాత్మరామ । అభినుతించెదను॥ శ్రీరామ॥
అన్నివిద్యలకెల్ల । ఆట పట్టయి నట్టి
అంబు జోద్భవురాణి । నాత్మలో దలతు॥ శ్రీ రామ ॥ జ్ఞా.సా.

15. తే॥ జానకీదేవి భూసుత ♦ సచ్చరిత్ర
జగము లేలెడి యిల్లాలు ♦ జనకపుత్రి
స్త్రీల కాదర్శ యారాధ్య ♦ శీలవతివి
నేఁటి యబలల మొరదీర్ప ♦ నీవెదిక్కు॥ హే.కుం.18-9

16. తే॥ రామభద్రుని సీతను ♦ ప్రేమతోడ
గుండెలో దాచుకొంటివి ♦ కోర్కెదీర
వారి దర్శనమున కింక ♦ దారిలేదు
అరసి చెరనుండి విడిపింపు ♦ మాంజనేయ॥ హే.కుం.18-10

17. శ్లో. కామతో ऽ కామతోవాపియత్కరోమి శుభాऽశుభమ్।
తత్సర్వం త్వయివిన్యస్య త్వత్ప్రయుక్తః కరోమ్యహం॥

తా.కోరికతోగాని, కోరిక లేకుండగాని ఏశుభాऽశుభకార్యములను చేయుచున్నానో,

I see and see nothing beyond Thy glory ।
Thyself my soul so can
I see in me the all in all Almighty ॥

తా॥ నేను నీ నామము కీర్తించుచున్నాను. నీముఖమును నేను చూచుచున్నాను. నీ వైభవమును మించి మరిదేనిని చూడను. నీవేనా యాత్మవి. కావున నా లోను, దృష్టికి గోచరించు అన్నిటిలోను, ఈసర్వస్వమును, సర్వశక్తి సంపన్నుడవగు నిన్నును, కూడ చూచుచున్నాను.

సూ: ఈ తేట గీతినివెవరు ఎపుడు రచించినారో నాకు తెలియదు. నాచిన్నతనమున సుమారు 12 సం॥ల వయస్సులోనున్నపుడు ఒకానొక సత్పురుషుడు (బహుశఆయనపేరు రామలింగస్వామి గారనుకుంటాను) దీనిని నాకు చెప్పినారు. ఇదినాకుచాలనచ్చినదిగనుకను, మంచి అర్థయుక్తముగనున్నదిగనుకను, నేను ఈ పద్యమును దాదాపు అనుదినమును పఠించుచునేయుండుటచేతను ఇదికాలగర్భమున నిమిడిపోకుండాయుండాలన్న ప్రయోజనమును దృష్టియందుంచుకొని ఇచటపొందుపరచియున్నాను.

19. గీ. పండితులు సత్కవీశ్వరులు ♦ బ్రహ్మవిదులు
జూచి తప్పులుగలచో ♦ విశుద్ధమతిని
దిద్దవచ్చును జగతి ♦ ప్రసిద్ధిగాగ
గాంచనము మెరుగుబెట్టిన ♦ కరణిదోప ॥ (మ.ప్ర.శ.)

సూచనపై ఇష్టదేవతాప్రార్థనలోని

1,2 వ పద్యములు రచయిత కృతము.

3,4,5,6,7 వ పద్యములు మాముత్తాత తండ్రిగారగు కోనం రాట్కవి చంద్ర విరచితమగు శ్రీ మహాలక్ష్మిపరిణయము నుండి గ్రహించబడినవి.

8,9,10 వ పద్యములు మా ముత్తాత తండ్రి గారే రచించిన శ్రీవేంకటేశ్వరోపాఖ్యానములోనివి.

11,12,13,19 వ పద్యములు మాపెదతాతగారగు అప్పలనరసింహదాసు రచించిన మహాప్రభుశతకములోనివి.

14 వది మా తండ్రిగారగు వేంకటరెడ్డిపంతులుగారు జ్ఞానసాధనము అనుశీర్షికతో రచించిన శ్రీ మహావిష్ణునిదశావతారాభివర్ణనములోనిది.

15,16వ పద్యములు మా యన్నగారగు పంచముఖేశ్వరరావు విరచితమగు హేమకుంభములోనివి.

17 వ శ్లోకము జగద్గురు శ్రీ చంద్రశేఖర భారతీస్వామివారువివేకచూడామణికి వ్రాసిన భాష్యము నుండి గ్రహించబడినది. (తి.తి.దే.ప్ర.)

18 వ పద్యము రచయిత విషయమై ఆ పద్యము క్రింద వ్రాసిన సూచన చూడుడు.

క్రీ. శ. పదునెనిమిదవ శతాబ్దమునకు జెందిన మదీయ ప్రప్రపితామహులును, కవిచంద్ర బిరుదాంకితులును అగు కోనంరాజప్రణీత శ్రీమహాలక్ష్మీపరిణయ ప్రబంధమునందలి సింహాచలక్షేత్ర, దేవాలయ, మందిర, పీఠవర్ణనమునయును, మాయిలవేల్పగు శ్రీవరాహనరసింహస్వామి స్తుతియును, యిటజతపరచబడినవి.

1. శా॥ శ్రీ సింహాచల దివ్యమందిరమణీ సింహాసనస్థుండు ల
క్ష్మీసాధ్వీకుచ కుంభకుంకుమరస శ్రీగంధవక్షుండు ది
గ్వ్యాసోజామర రాట్కిరీట విలసత్పాదుండు ప్రహ్లాద ర
క్షాసక్తుండు పరాత్పరుండగు నృసింహస్వామినన్ బ్రోవుతన్॥ 1-1

2. సీ॥ పరిపంథిదర్పభూధరగరుత్పటలో గ్రహారిశతారంబు సింహాచలంబు।
వితతపాషండ దుర్మత మహారణ్య దావాగ్ని కీలంబు సింహాచలంబు।
ఘనజగత్త్రయ ఘోర కలుష నీహార మార్తాండప్రభంబు సింహాచలంబు।
కాంచనకశిపు రక్షః క్రూర భుజగ విహంగేశ్వరంబు సింహాచలంబు।

గీ॥ దార కల్పంబు నిర్వాణదాయకంబు
నద్రి రాజంబు భవ్యదివ్యస్థలంబు
పరమ కళ్యాణ ధామంబు పంకజాల
యాధివాసంబు చారు సింహాచలంబు॥ 1-47

3. సీ॥ సవతి పోరాటకై చదలేటితర
గలుపై వచ్చెనని గట్టుపట్టి బెదరఁ
దళుకు వన్నియ పట్టు మడతలంచు
సురేంద్ర కన్యకామణులెల్లఁగట్టఁబోవ
నవరపక్షమున సీతాంశురోచులు
దోఁచెనని తారలాశ్చర్యమంది చూడఁ
జెలువంపు మేలి సంజలఁబూయుమ
ల్లెపూలంచు దిక్కాంతలుత్రుంచఁగదియఁ

గీ॥ బరగనేశైలవిభుశిలాస్ఫటిక వజ్ర
ఘటిత హరి మందిర ప్రభల్ గగనమంటె
నట్టి సింహాచలంబెన్న నలవియగునె
నలువకైనను జిలువరాబులునికైన॥ 1-48

4. సీ॥ విరజాప్రవాహమే పుర్శైలమునఁబుట్టె
నవఘమై గాంగధారాఖ్యమగుచు।
హరిచందనాదులే పుర్శైలమున నొప్పిఁ
గనక సౌగంధికావనములగుచు।
భూతాధినాథుఁడే పుర్శైలమునఁబొల్చె
త్రిపురాంత కాభిఖ్యఁదేజరిలుచు।
సురమునివ్రాత మేపుర్శైలమునఁబొల్చెఁ
పరమభక్తిని దాసవర్గమగుచుఁ।

గీ॥ ప్రణవరూపంబునిర్గుణ బ్రహ్మమైన।
విష్ణుఁడేగిరి పురిలోన వెలసెన్నృహరి।
మూర్తితో నట్టి సింహాద్రిఁ బొగడవశమె।
భవునికైనను బద్మ సంభవునికైన॥

5. సీ॥ పటునీలమణిగుహాభవ వియద్గంగాంబు
ప్రముదితాతతపూతభవ్యభూమి।
పార్శ్వద్వయస్థరంభా చూత నారంగ
మధులసత్సోపాన మండలంబు।
కల్పపున్నాగ సౌగంధికామల్లికా కాంచన
సుమవాటి కాచయంబు।
నాకాశ చుంబిత ప్రాకారగోపురాయత
హేమచక్ర దేవాలయంబు।

గీ॥ మణితట స్వర్ణ శిఖరసముచితంబు।
సిద్ధ వైమానిక మునీంద్ర సేవితంబు।
పరమ వైష్ణవ సముదయ పరివృతంబు।
పుణ్యనిలయంబు శ్రీ సింహభూధరంబు॥

6. ఉ॥ ఆమహనీయ శైలభవనాంచిత పీఠమునన్ వసించి సు
త్రామ పితామహత్రిపురదైత్యవిరామ ముఖామరుల్ ముని
స్తోమములున్ భజింప కలిదుష్ట విదూరత శిష్టరక్షణం
బీమహిఁజేయుచున్ వెలుఁగు దీవు నృసింహజగత్ప్రసిద్ధిగాన్॥

7. సీ॥ పటుకఠోరాభీల బహుసత్వ సంయుక్త
కనకాద్రి నిభదీర్ఘ కాయమమరఁ
బార్శ్వ సంస్ఫాలనపాథోలవ శ్రేణి గగ
నాంతరాళంబు గలయఁబర్వ।
చటుల నృత్యంబు చౌపుటచెలంతుల
రసాతలగహ్వరవురొంపిగలయఁబారఁ
జండకరాళోగ్రశాత దంష్ట్రోద్దండ
కంటకాగ్నిచ్ఛటల్ గ్రందుకొనఁగ

గీ॥ దైత్యుఁబరిమార్చి నిగమముల్ ధాత కొసఁగు
మహితగురు విక్రమస్ఫూర్తి మత్స్యమూర్తి
వైన నినుఁగొల్తు సింహశైలాధివాస
మధిత జనలోక బలితాంహ మనుజసింహ॥ 1

8. సీ॥ జంభఘ్నదంభోళిజృంభణోదారమై
రమణీయతరకప్పరంబు మెఱయఁ
గనక భూధర మహాగహ్వరోదీర్ణమై
పటుకరాళవిశాలవక్త్రమమర
సర్పాధినాథపుచ్ఛస్ఫార ఘోరమై
భయదసుస్థిరపాద పటలమమర
బహుతర బ్రహ్మాండ భాండ సంతతు
లొక్క సరిమువ్వెత్తుగ మీటు సత్వమమరఁ

గీ॥ దనరి మందరనగము వెన్నునధరించి కూర్మి
సుర సంఘములఁబ్రోచు కూర్మమూర్తి
వైన నినుగొల్తు సింహశైలాధివాస
మధిత జనలోక బలితాంహ మనుజసింహ॥ 1

9. మ॥ దరణీచక్రముచుట్టి పట్టుకొని పాతాళంబులంఘించి స
త్వరతన్ నేగు హిరణ్యనేత్రుని యురస్థానంబు భేదించి క్ర
మ్మర శృంగాగ్రమునన్ ధరారమణి ప్రేమన్ నిల్పు భూదార సుం
దర చిద్రూప విలాస మానవమృగేంద్రా నిన్నుగీర్తించెదన్॥ 1

10. సీ॥ అతి కఠోర భయంకరాట్టహాసోద్వృత్తి
నబ్జజాండ ఘటంబులవిసిపడఁగ
చటులోగ్ర గాఢనిశ్వాస ఝంఝూవాత
పటుబలోద్ధతి గిరుల్ పాతులగల
బలుదీర్ఘతరనఖాబాహులోగ్ర
విదళన స్ఫూర్తి నభ్రశ్రేణి పొర్లిపడఁగఁ
ఝండకరాళ దంష్ట్రా ప్రభానలదీప్తి
నఖిలదిక్కోణంబు లంధములుగ

గీ॥ నురుజవంబులలంఘించి హుంకరించి
కధిసి కులిశాభనఖపాళిఁగనక కశిపు
బట్టుకొని పొట్టచీల్చిన ప్రభుఁడవీవె
మధిత జనలోక బలితాంహమనుజసింహ॥ 1-5

11. మ॥ సురగంధర్వదిగీశ పన్నగఫణి స్తోమంబులంగెల్చి ని
ర్జర సామ్రాజ్య సదస్యుఁడైన బలి నిర్బంధించితల్లక్ష్మి నిం
ద్వరతో నింద్రున కిచ్చి తల్లికి మనస్తాపంబుదూలించి భూ
సురఖర్వాకృతిదాల్చు మానవమృగేంద్రా నిన్ను సేవించెదన్॥ 1-5

12. మ॥ వరవజ్రాభ కుఠారవిక్రమ కళావ్యాపార దోస్సార భీ
కర శక్తిన్ గృతవీర్య నందన ముఖక్ష్మాకాంతలఁజండ ఘోర
రణక్షోణులఁద్రుంచి కశ్యపునకున్ బ్రఖ్యాతి నర్పింపవే
ధర రామాకృతిఁదాల్చి మానవమృగేంద్రా నిన్నుఁగీర్తించెదన్॥ 1-5

13. సీ॥ యెవని రౌద్రరసంబు భువిని లంకాదైత్య
భూధరావళికి దంభోళిధార
యెవని దయారసంబి నతనూజ విభీష
ణాది భక్త శ్రేణి కమృత ధార
యెవని నామరసంబు హిమసానుమత్సు
తావర చాతకమునకు వర్షధార

[illegible]
రఘుకులాధీశ మౌళి శ్రీరామ మూర్తి
వైన నినుఁగొల్తు సింహశైలాధివాస
మధిత జనలోక బలితాంహమనుజ సింహ॥ 1-60

14. మ॥ మురళీగానమునించి గోపసతులన్ మోహించి బృందావనాం
తర వీధిన్విహరించి కంసముఖదైత్యశ్రేణినిర్జించి నిర్జర
భూజంబు వారించి ధర్మజుని రాజ్యప్రాప్తుఁగావింపవే
ధర కృష్ణాకృతిఁదాల్చి మానవ మృగేంద్రా! నిన్ను సేవించెదన్॥ 1-61

15. మ॥ చిరకాలార్జిత దానవీజన తపశ్శీలవ్రతానూన బం
ధుర నిష్ఠాతిశయ ప్రభావమహిమల్ తూలించి తద్దైత్యులన్
సరిపోరాడి వధించి యింద్రుని మనస్తాపంబుఁదూలింపవే
ధర బౌద్ధాకృతిఁదాల్చి మానవమృగేంద్రా నిన్నుఁబూజించెదన్॥ 1-62

16. మ॥ ధరణీకాంత దురంత దుష్టఘన దైత్యశ్రేణి కావించు సం
కరకృత్యంబులు తెల్పఁబద్మభవుఁడల్కన్ నీకెఱింగింప శం
బరభూమిన్ జనియించిఖడ్గహతి నప్పాపాత్ములం ద్రుంపవే
యరయంగాఁ గలికత్వమొంది నరసింహానిన్నుఁ బ్రార్థించెదన్॥ 1-63

17. చ॥ బలిమిఁదలంచు లెక్కవసుబాహుల బెంచితలంచు రెట్టి నిం
పలరఁగ భాగమెత్తి పదియాఱులగించి శతంబుచేత నే
ర్పలవడగుణియింపఁగాఁదుదకు వచ్చిన లబ్ధము మువ్విధంబులై
తలలు కనుల్పదాళిగల దైవమ వీవకదా మహాప్రభూ॥ 1-64



# అథకశ్చిత్ శాన్తి మంత్రాణి

1. మం॥ భద్రఙ్కర్ణేభి శ్శృణు యామదేవాః । భద్రమ్పశ్యేమాక్షభిర్యజత్రాః। స్థిరై రఙ్గైస్తుష్టువాగ్ంసస్తమూభిః। వ్యశేమదేవహితం యదాయుః॥ స్వస్తిన ఇన్ద్రోవృద్ధశ్శ్రవాః। స్వస్తినః పూషావిశ్వవేదాః। స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః। స్వస్తినో బృహస్పతిర్దదాతు ॥ ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

సూ:- ఇయ్యది అధర్వణవేదాంతర్గతమైన (మాండూక్యాది) ఉపనిషత్తులశాంతి మంత్రము.

తా॥ ఓ దేవతలారా! మేము చెవులచే శుభము వినుదుముగాక! యజ్ఞశీలురమైన మేము కన్నులచే శుభమును జూతుముగాక! స్థిరమైన అంగములతో శరీరము ఉచ్ఛరించు మన్త్రములతో మిమ్ముస్తుతించుచూ దేవులు ప్రసాదించిన దీర్ఘాయువును పొందుదుముగాక! బృహస్పతి మొదలగు పెద్దలయొద్ద వినెడి ఇంద్రుడు మాకు శుభమిచ్చుగాక! సర్వమును తెలిసెన సూర్యుడు మాకు శుభమిచ్చుగాక! అహింసాపాలకుడైన గరుత్మంతుడు మాకు శుభమిచ్చుగాక! బృహస్పతి మాకు శుభమిచ్చుగాక!

ఓ పరమాత్మా! మాకు ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవిక తాపత్రయములు శమించుగాక! ( ఆధ్యాత్మికమనగా దేహసంబంధమైన తాపము. ఇది వాత,పిత్త,శ్లేష్మాదులు యతిక్రమముచే గలిగెడి దుఃఖము. ఆది భౌతికమనగా భూతములచే గలిగెడు దుఃఖము. ఇది సర్ప, వృశ్చిక, వ్యాఘ్ర, చోరాదులవలన గలిగెడు దుఃఖము. ఆధి దైవికమనగా పిడుగులు, దైవికములైన పంచభూతములచే గలిగెడు దుఃఖము)

2.మం॥ శన్నోమిత్రశ్శం వరుణః। శన్నోభవత్వర్యమా! శన్న ఇంద్రో బృహస్పతిః । శన్నోవిష్ణురురుక్రమః॥ నమో బ్రహ్మణే నమస్తే వాయో। త్వమేవ ప్రత్యక్షంబ్రహ్మాసి త్వమేవ ప్రత్యక్షం బహ్మావదిష్యామి। ఋతం వదిష్యామి। సత్యం వదిష్యామి। తన్మామవతు। తద్వక్తార మవతు। అవతుమాం। అవతు వక్తారమ్। ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

సూ:- ఇయ్యది కృష్ణయజుర్వేదాంతర్గతమైన (కఠ, తైత్తిరీయాది) ఉపనిషత్తులకు శాంతి మంత్రము.

తా॥ సూర్యుడు మాకు శుభమిచ్చుగాక! వరుణుడు శుభమిచ్చుగాక! అర్యముడు మాకు శుభమిచ్చుగాక! ఇంద్రుడు, బృహస్పతి మాకు శుభమిత్తురుగాక! విశాలమైన పాదములు గల విష్ణువు మాకు శుభమిచ్చుగాక! బ్రహ్మమునకు నమస్కారము. వాయువా! నీకు నమస్కారము. నీవే ప్రత్యక్షమైన బ్రహ్మవు. నిన్నే ప్రత్యక్ష బ్రహ్మముగా చెప్పెదను. శాస్త్ర విహితమైన దానిని పలుకుచున్నాను. త్రికరణశుద్ధమైన సత్యమును పలుకుచున్నాను. అది నన్ను రక్షించుగాక! చెప్పువానిని రక్షించుగాక! నన్ను రక్షించుగాక! చెప్పువానిని రక్షించుగాక!

3. మం॥ నమో బ్రహ్మణే । నమో అస్త్వగ్నయే నమః పృథ్వ్యై నమ ఓషధీభ్యః। నమో వాచే
నమో వాచస్పతయే। నమో విష్ణవే బృహతే కరోమి॥ ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

సూ:- ఇయ్యది మహాన్యాసమునుండి గ్రహించబడినది. ఏ వేదములోనిదో తెలియదు. చదువరులెవరైనా తెలియజేస్తే ఈ పర్యాయము ముద్రింపజేసే ప్రతులలో సూచించబడును.

తా॥ బ్రహ్మమునకు నమస్కారము. అగ్నిదేవునికి నమస్కారము అగుగాక! పృథ్వికి నమస్కారము. ఓషధులకు నమస్కారము. వాక్కునకు నమస్కారము. వాక్కునకు పతియగు గురునకు (Venus) నమస్కారము. బలవంతుడైన విష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

వివ:- ఓషధులనగా పంటపండు వఱకే జీవించునవి. ఉదా॥ ధాన్యము, గోధుమ, పప్పు దినుసులు మొదలగునవి.

4. మం॥ ఓం తచ్ఛంయోరావృణీ మహే। గాతుం యజ్ఞాయ। గాతుం యజ్ఞపతయే। దైవీ
స్వస్తిరస్తు నః। స్వస్తిర్మానుషేభ్యః। ఊర్ధ్వం జిగాతు భేషజమ్। శన్నో అస్తు ద్విపదే।
శం చతుష్పదే। ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

సూ:- దీనికి ముందర మంత్రపు సూచన దీనికి కూడా వర్తించును.

తా॥ యజ్ఞకర్మ ఫలప్రదాతయని ప్రసిద్ధుడైయున్న యా పరబ్రహ్మమును ప్రాప్తించినట్టివియును, రాబోవునట్టివియును, అగురోగాదులనుపశమింపజేసి తద్దుఃఖనివారణచే ఐహికాముష్మిక సుఖములనొసంగుటకై యభిముఖముగ ప్రార్థించుచున్నాము. అనుష్ఠింపబడబోవు యజ్ఞము యోగ్యముగా ప్రవర్ధిల్లుటకు యజ్ఞపతి యైన యా మహావిష్ణువుని గుఱించి ప్రార్థించుచున్నాము. దేవతలచే పొందబడిన క్షేమము మాకు కలుగుగాక! మానవాళికి క్షేమము కలుగుగాక! ఇట్టుపైన సర్వానిష్టనివారణమై మాకు సుఖము ప్రాప్తించుగాక! మాపుత్రులు, బంధువులు, పరివారము, మొదలగు వారికందరికిని క్షేమము కలుగుగాక! మాపశువులకు క్షేమము కలుగుగాక!

5. మం॥ ఆప్యాయన్తు మమాఙ్గాని । వాక్ప్రాణశ్చక్షు శ్రోత్రమధోబల మిన్ద్రియాణిచ

సర్వాణి। సర్వం బ్రహ్మోపనిషదం । మాహం బ్రహ్మనిరాకుర్యామ్।

మామా బ్రహ్మనిరాకరోత్। అనిరాకరణమస్తు। అనిరాకరణమ్మే అస్తు।

తదాత్మ నిరతేయ ఉపనిషత్సు ధర్మాః। తే మయి సన్తుతేమయిసన్తు॥

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః। ఇతి సామవేదోపనిషచ్ఛాన్తిః॥

తా॥ నా యొక్క వాక్కు ప్రాణము, కండ్లు, చెవులు శక్తియును అగు సర్వేంద్రియములును రక్షింపబడుగాక। ఉపనిషత్తులు ప్రభోధించునదంతయు బ్రహ్మమే. అనగా బ్రహ్మమును గురించియే. నేను బ్రహ్మమును నిరాకరింపకుందును గాక। బ్రహ్మ నన్ను నిరాకరింపబోవును గాక! నిరాకరింపకుండుటయగుగాక! అనిరాకరణము కలుగుగాక! నాకు బ్రహ్మము చేత అనిరాకరణము కలుగుగాక! అనగా ఉపనిషత్తులలో ప్రభోధించబడిన బ్రహ్మమును పొందుటకు తగినసాధనమును చేయుదునుగాకఅనిభావము. ఉపనిషత్తులయందు ప్రభోధించబడిన ధర్మముల మూలమున అనగా ఉపనిషత్సూక్తులమూలమున ప్రశాంతమైన మనస్సుగలవారియందెట్టి ధర్మములుప్పొంగునో, అట్టి ధర్మములు నాయందు వర్థిల్లుగాక! సర్వదా నాయందు వర్థిల్లుగాక!

సూ:-ఇయ్యది సామవేదాంతర్గతమైన (ఛాందోగ్యాది) ఉపనిషత్తులకు శాంతి మంత్రము.

6. మం॥ వాఙ్మే మనసి ప్రతిష్ఠితా। మనోమేవాచి ప్రతిష్ఠితం। ఆవిరా వీర్మ ఏధి వేదస్యమ

ఆణి స్థశ్రుత మ్మే మాప్రహాసీః॥ అనే నాధీ తే నాహో రాత్రాన్సన్ధ ధా మ్యృతం

వదిష్యామి।సత్యం వదిష్యామి। తన్మామవతు।తద్వక్తార మవతు । అవతుమాం।

అవతు వక్తారమ్। ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

సూ:- ఇయ్యది ఋగ్వేదాంతర్గతమైన ( ఐతరేయాది) ఉపనిషత్తులకు శాంతి మంత్రము.

తా॥ నా యొక్క వాక్కు మనస్సున స్థిరమైయుండుగాక! నామనస్సువాక్కునందు నెలకొని యుండుగాక! ఓ పరమాత్మా! నాకు ప్రకటితమగుము. ఓ వాఙ్మనసులారా! వేదములు బోధించు సత్యమును నేను క్షుణ్ణముగ గ్రహించునట్లు చేయుడు. నేను వినినదానిని మఱువకుందునుగాక! వేదోక్తమగు నీవిద్యను రేయింబవళ్ళు నేను నిరంతరముగా నభ్యసింతును. సరిగా చెప్పుచున్నాను. నిజమును చెప్పుచున్నాను. ఆ సత్యము నన్ను రక్షించుగాక! చెప్పువానిని (అనగా గురువును) రక్షించుగాక! నన్నురక్షించుగాక! గురువును రక్షించుగాక!

7. మం॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే। పూర్ణస్య
పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే॥ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

తా॥ ఈ బ్రహ్మమంతటను వ్యాపించియున్నది. నామరూపసహితమైన ఈ జగత్తు నందంతటను వ్యాపించియున్నదే. ఆపూర్ణమైన బ్రహ్మమునుండి ఈపూర్ణమైనజగత్తు బయల్పడినది. అట్లు పూర్ణమైన జగత్తునుండి పూర్ణమైన బ్రహ్మమును వేరుచేసినచో జగత్తుకు పూర్ణత్వము గలిగించిన యాపూర్ణమైన బ్రహ్మమే మిగిలియుంటున్నది.

సూ:- ఇది శుక్ల యజుర్వేధాంతర్గతమైన ( ఈశావాస్యాది) ఉపనిషత్తులయొక్క శాంతి మంత్రము.

8. మం॥ సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై। తేజస్వినావధీతమస్తు
మావిద్విషావహై॥ ఓంశాంతి శ్శాంతి శ్శాంతి॥

తా॥ పరమాత్మ గురుశిష్యులమగు మమ్మిద్దరను గూడ రక్షించుగాక! మమ్మిద్దరను పోషించుగాక! మేమిద్దరముగూడ విద్యాసామర్థ్యమును పొందుదుముగాక! మేము చదివినది తేజస్సుగలదై సార్థకమగు గాక! మేమిరువురుము పోరాడకుందుముగాక!

సూ:- పైనున్న 2 వమంత్రము క్రింద సూచన దీనికి కూడ వర్తించును.



# అథ కశ్చిత్ సుభాషితాని

1. శ్లో॥ నసాంపరాయః ప్రతిభాతిబాలం ప్రమాద్యన్తం విత్తమోహేనమూఢం।
అయంలోకోనాస్తిపరం ఇతిమానీపునః పునర్వశమాపద్యతే మే॥

తా॥ పుత్రదారాధన పశ్వాదులచే విమోహితుడై ప్రమత్తుడగు నజ్ఞానికి పరలోకము, తత్ప్రాప్తిసాధన విశేషము, ప్రకాశించదు(గుర్తుకురాదు) ప్రత్యక్షముగా గనుపడునదియే లోకమనియు, ఇంతకువేరైనపరలోకము లేదనియు, దలంచి సంసారమే అనన్తసుఖములకాట పట్టని భ్రమించువాడు మాటిమాటికి పుట్టుచు చచ్చుచు నాయధీనుడగుచున్నాడు.

క.ఠ.1.2.6

2. శ్లో॥ నివార్యతామాలి। కిమప్యయంవటుః।
పునర్వివక్షుః స్ఫురితాధరోష్టః।
నకేవలం యోమహతో ఉపభాషతే।
శృణోతి తస్మాదపి యస్సపాపభాక్॥

తా॥ పార్వతీదేవి తన చెలికత్తెనుద్దేశించుచు, “ఓసీ! ప్రకాశించుచున్న క్రింది పెదిమలు గలిగి శంకరునికి వ్యతిరేకముగ మరల మరల ఏదేదో గొణుగుచున్న ఈ బ్రహ్మచారి నివారించబడుగాక! ఏలనన గొప్పవారిని (శ్రేష్ఠులను, విస్తృతమైన వారిని లేదా మహాత్ములను) గురించి ఎవ్వారలైతే దుర్భాషలాడెదరో కేవలము వారేగాక వాటిని వినువారుకూడా పాపభూయిష్ఠులగుదురు గనుక” అనెను.

సూ:- వాస్తవమునకు శివుడే మారు రూపమున పార్వతీదేవి కడకు వచ్చి పార్వతీదేవి మనస్సు నెఱుంగుటకు గాను శివునికి వ్యతిరేకముగ దుర్భాషలాడినపుడు పార్వతీదేవి అన్నమాటలివి.

3. శ్లో॥ సంతప్తాయసి సంస్థితస్య పయసో నామాపి నశ్రూయతే,
ముక్తాకారతయా తదేవ నలినీపత్రస్థితం దృశ్యతే।
అన్తః సాగరశుక్తిమధ్యపతితం తన్మౌక్తికం జాయతే,
ప్రాయేణాధమ మధ్యమోత్తమ జుషామేవంవిధా వృత్తయః॥

తా॥ బాగుగా తపింపజేయబడియున్న పెనముపై జల్లబడిన నీటియొక్క పేరైనను వినిపించదు (వెంటనే ఆవిరిగామారి అదృశ్యమైపోవును) తామరాకుపై జల్లబడిన అదేనీరు ముత్యపు ఆకారమున కనబడుచున్నది. సముద్రాంతరమున నున్న ముత్యపుచిప్ప మధ్యపడిన అదేనీరు ముత్యముగా పుట్టుచున్నది. తరచుగా అధమ, మధ్యమ, ఉత్తమ పురుషులతో గూడుకొనియున్న మానవులవృత్తులు (నడవడులు, పోకడలు) ఈప్రకారము యుండును.

గుణములను, ఉత్తమునితో గూడినవాడు ఆయుత్తముని గుణములను పొందుదురని భావము

4. శ్లో॥ క్షీరేణాత్మగతోదకాయహి గుణాదత్తాః పురాతే ఖిలాః,
క్షీరోత్తాపమవేక్ష్యతేన పయసాస్వాత్మాకుశానౌహుతః।
గన్తుం పావకమున్మనస్తదభవత్ దృష్ట్వాతు మిత్రాపదం,
యుక్తంతేనజలేనశామ్యతి, సతాంమైత్రీపునస్త్వీదృశీ ॥

తా॥ పాలతోకలసిన నీటి యొక్క సమస్త గుణములు పాలలో కలుపుటకు పూర్వమెట్లున్నవో అటులనే ఆనీటికి ఈయబడినవగుచున్నవి. అనగా పాలతో కలియుటవలన నీటి యొక్క స్వతస్సిద్ధ గుణములు మారుటలేదని భావము. మరైతే నీరు పాలతో కలియుటచేత ఆపాలకు నీటితో స్నేహభావమేర్పడుటవలన ఆ పాలయొక్క రంగు, రుచి, వాసనాదిగుణములు కొంతమట్టుకు నీటికి అబ్బుచున్నవి. కాచిమరిగించగా పొంగుచున్నపుడు తన మిత్రుడగు ఆపాలయొక్క ఆపదను చూచి నీరు వేగిరపడుచూ యున్నవానివలె, ఆయగ్నిలోపడినప్పుడు తానే ఆహుతి నొందుచున్నది. ఆ నీటి చేత అగ్ని యొక్క వేడిమి తగ్గి పాలయొక్క వేడిమి (పొంగుట) తగ్గుటయుక్తమే. సత్కర్మలనాచరించువారి యొక్క మైత్రి ఇటువంటిదేయగుచున్నది.

5. శ్లో॥ వయమిహ పరితుష్టావల్కలైస్త్వందుకూలైః,
సమ ఇవ పరితోషోనిర్విశేషోవిశేషః।
సతుభవతు దరిద్రో యస్యతృష్ణా విశాలా,
మనసి చ పరితుష్టేకో ఉర్ధవాన్కోదరిద్రః ?

తా:- కణ్వమహాముని యాశ్రమమున నున్నప్పుడు శకుంతలను దుష్యంత మహారాజు గాంధర్వ వివాహము చేసుకొనిన యనంతరము తన రాజధానికి ఆమెను తోడ్కొని పోవుటకు తగిన సన్నాహము నేర్పరచుటకు వెళ్ళినాడు. అయితే యాతడు శాపవశమున శకుంతలను మరచిపోగా ఆమెను దుష్యంత మహారాజు కొలువులో నప్పగించుటకు గాను మునికుమారులు దుష్యంతుని రాజభవనముకు శకుంతలను తీసుకుని వెళ్లినపుడు వారిని, వారి నలిగి నలిగియున్న కాషాయాంబరములను, చూచి దుష్యంత మహారాజు నవ్వినవాడాయెను. అట్లు యాతడు నవ్వుటకు గల కారణమును గ్రహించిన మునికుమారులిట్లు పలికిరి. “ఓ రాజా! మేమిట (ఈ) కాషాయవస్త్రములతోను, నీవైతేనో (ఆ) పట్టుబట్టల తోను, పరితుష్టులుగనే యున్నాము.

మరి సంతోషము నీకునూ, మాకునూ సమముగనే యున్నది సుమా! ఇందులో విశేషమేమియును లేదు. ఎవ్వని తృష్ణ( ఆశ, కోరిక) హెచ్చుగయుండునో వాడే దరిద్రుడు, మనస్సుయందు పరితుష్టుడగుచో ఎవడు ధనవంతుడు? ఎవడు దరిద్రుడు?" అనిరి

6. శ్లో॥ యావత్ స్వస్థమిదం శరీరమరుజం యావజ్జరాదూరతః,
యావచ్చేంద్రియశక్తిరప్రతిహతో యావత్క్షయోనాయుషః।
ఆత్మశ్రేయసి తావదేవ విదుషోకార్యః ప్రయత్నోమహాన్,
సందీప్తే భవనేతు కూపఖననం ప్రత్యుద్యమఃకీదృశః॥

తా॥ ఎంతకాలము ఈ శరీరము సమాధాన స్థితియందుండునో లేదా అన్యచింతలు లేకుండ యుండునో, ఆరోగ్యవంతముగయుండునో, ఎంతకాలము ముసలితనము దూరముగ యుండునో మరియు ఎంతకాలము ఇంద్రియములయొక్క శక్తికి విఘాతము కలుగదో, ఎంతకాలము ఆయుష్షుక్షయముకాదో, అంతవరకు విద్వాంసుడగు మహాత్ముడు తనయొక్క శ్రేయస్సు యందు మాత్రమే నిమగ్నమైయున్న కార్యములను ప్రయత్నపూర్వకముగ జేయుచున్నాడు. ఇల్లు అంటుకొనిన యనంతరము నూతిని త్రవ్వుటకుద్యమించుట ఎటువంటిది? అనగా అంత్యకాలము వచ్చేదాకా మోక్షమార్గమును పట్టనివాడు ఇల్లంటు కొనినయనంతరము నూతినిత్రవ్వబోవువాని తో సమానమని భావము.

7. శ్లో॥ వనేరణే శత్రుజలాగ్నిమధ్యేమహార్ణవే పర్వతమస్తకేవా।
సుప్తం ప్రమత్తం విషమస్థితంవారక్షన్తి పుణ్యానిపురాకృతాని॥

తా॥ వనమునందుగాని, యుద్ధముయందుగాని, శత్రు, జలాగ్నిమధ్యనున్నవానినిగాని, మహారణ్యమందున్నవానినిగాని, లేదా పర్వత శిఖరమునందున్న వానిని గాని, గాఢనిద్రయందున్న వానినిగాని, విషమస్థితియందున్న వానినిగాని అంతకుముందాతడు చేసిన పుణ్యకర్మలు రక్షించుచున్నవి.

8. శ్లో॥ అర్థాగృహేనివర్తన్తే శ్మశానే మిత్ర బాన్ధవాః
సుకృతం దుష్కృతం చైవ గచ్ఛన్తమనుగచ్ఛతి॥

తా॥ ఆర్జించిన ధనము ఇంటియందు ఉండిపోవుచున్నది. మిత్రులు, బంధువులు శ్మశానమునుండి తిరిగిపోవుచున్నారు.తాను చేసిన సుకృత దుష్కృతములు మాత్రమే ఈలోకమువదలి పరలోకమునకు పోవువానిని అనుసరించి వెళ్ళుచున్నవి.



# మా వంశపరిచయము

కోనంరాజు అను నామధేయము గలనేను వద్దిపర్తి వంశజుడను. మా స్వస్థలము విశాఖపట్నం జిల్లా యలమంచిలి తాలూకాలోని సర్వసిద్ధియను గ్రామము. ఆగ్రామకరిణీకము వద్దిపర్తివారిదే. మేము 6వేల నియోగి బ్రాహ్మణులము. భార్గవ, చ్యవన, ఆప్నువాన, ఔరవ జమదగ్నిః పఞ్చా ఋషేయప్రవరాన్విత శ్రీవత్సగోత్రీకులము.

జ్ఞానసాధనము అనే శీర్షికతో శ్రీమహావిష్ణుని దశావతారాభివర్ణనమును రచించి ఆరోజులలో గొప్పకర్మిష్టిగా తెలిసికొనబడుచు నుండెడి పరమభక్తులు వేంకటరెడ్డిపంతులు (1867 నుండి 1951వరకు) గారికిని, వారి సతీమణి పేరిందేవి గారికిని ద్వితీయపుత్రునిగ అనకాపల్లితాలూకా కశింకోట గ్రామమున జనించితిని. మేము నలుగురు అన్నదమ్ములము, ముగ్గురు అక్కచెల్లెండ్రు. ఇప్పుడున్నవారు నేనును, ఒక్కచెల్లెలు మాత్రమే.

శ్రీ రక్తాక్షినామసంవత్సర ఆశ్వయుజశుద్ధత్రయోదశి శుక్రవారం రాత్రి 2గం॥29 ని॥లకు క్రీ.శ. 10-10-1924) పూర్వాభాద్ర నక్షత్ర చతుర్థ చరణమందు నాజననము.

హేమకుంభము అనుకృతిని రచించిన పంచముఖేశ్వరరావు (క్రీ.శ.1915 నుండి 1993 వరకు) గారు మా యన్నగారు.

మహాప్రభుశతకమును రచించిన అప్పలనరసింహదాసుగారు (క్రీ.శ.1805 నుండి 1885 వరకు) మాతాతా సహోదరులు.

శ్రీమహాలక్ష్మీపరిణయము, వేంకటేశ్వరోపాఖ్యానము, రేవతీపరిణయము, జానకిరామకృతులను, రచించి మహాభక్తులుగను, అద్భుత దివ్యశక్తి సంపన్నులుగను ఆ రోజులలో కీర్తితులై, కవిచంద్రబిరుదాంకితులైన కోనంరాట్కవి (క్రీ.శ.1754 నుండి 1834 వరకు) గారి ప్రపౌత్రజుడను నేను. అనగా వారు మాతాతగారగు (ద్వితీయ) కోనంరాజు గారికి తాతగారు.

ఈ మా ప్రప్రపితామహులగు కోనంరాట్కవీంద్రుని గురించి విజయనగరం వేదవిజ్ఞానవర్ధనీ పరిషత్తువారు సుమారు 60 సంవత్సరముల క్రిందట ప్రచురించిన మహాకవిప్రశంశ యందు చెప్పబడియున్నది. అందు చాలమంది మహాకవులు ప్రశంసించబడినారు. ఆపుస్తకమును నేను నాచిన్నతనములో చూచియున్నాను. ఆకృతి ఎక్కడున్నదో ఇప్పుడు గానరాకున్నది.

శ్రీఅక్కిరాజురమాపతిరావు గారు అద్భుత వాస్తవాలు అను శీర్షిక క్రింద ఈ మాప్రపితామహులగు కోనంరాట్కవిగారు పూరీజగన్నాధ స్వామిదర్శనమునకు విధించబడియున్న సుంకమును రద్దుచేయించిన విధానమును, అండమాన్ దీవులనుండి ఎటువంటిసాధనమును లేకుండా ఒంటరిగా సముద్రజలములపై విశాఖతీరాన వున్నరేవు పోలవరం చేరిన విషయమును గురించియు, వ్రాసియున్నారు. ఈ సందర్భమున 1వ అనుబంధము చూచెదరుగాక!

శ్రీ అడిదము రామారావు పంతులు (రిటైర్డ్ సీనియర్ తెలుగు పండితులు, శ్రీమహారాజావారి కళాశాల, విజయనగరం) గారిచే రచించబడి ఆంధ్రవిజ్ఞాన సమితి, విజయనగరం వారిచే జూన్ 1940 న ప్రకాశింపజేయబడిన ద్వితీయ ప్రచురణమగు విస్మృతకళింగాంధ్రకవులు ప్రధమభాగము (95 -105 పుటలు) నందుగూడ వీరిగురించి ప్రస్తావించబడియున్నది. ఈ సందర్భమున 2వ అనుబంధము చూచెదరుగాక!



## స్వవిషయము

నాచిన్నతనమున పరమభక్తులును, అత్యన్త నియమనిష్ఠాపరులును, శ్రీమద్రామాయణ భారత భాగవతాది గ్రంధములనెన్నిటినో పరిశీలించినవారును, తైత్తిరీయాదియుపనిషత్తులను అధ్యయనము చేసినవారును, సద్గురువులగు బలిజేపల్లి రామదాసు (గోవిందరాంరాం గారు - వీరిని కొండకర్ల గ్రామములో దర్శించు భాగ్యము నాకు కూడ గలిగినది) గారి శిష్యులును అగు మాపితృవరేణ్యులకు చాలా సన్నిహితముగా నుండుచూ ఆయనతోనే ఆయన పాల్గొను కార్యక్రమములన్నిటికిని, నేనుగూడ వెళ్ళుచూ యుండేవాడిని. పూజలు ఎక్కడ జరిగినా, సద్గోష్ఠి ఎక్కడజరిగినా, సత్పురుషులు నలుగురెక్కడ చేరినా అక్కడ ఆయన ఉండేవారు. ఆయనతో సహా నేను కూడ ఉండేవాడిని: ఆయనకు చాలాచాలా భజనకీర్తనలు వచ్చు. వినుటకు చాలా ఇంపుగా పాడేవారు. మాయింట్లో ప్రతిసోమవారము భజనా, ప్రతిదినము ప్రొద్దున్న ఉపనిషత్పారయణా, రాత్రిపురాణకాలక్షేపమూ జరుగుతునే ఉండేవి. ప్రతిదినము ఉదయము 5గం|| కు ఆయనతోనే లేచేవాడిని. మంచము దిగకుండనే నాచేత శివానందలహరి, పోతన భాగవతము మొదలగు వాటియందలి ప్రార్థనా శ్లోకములను, పద్యములను, చెప్పించుచుండేవారు. ఇట్టి సత్సాంప్రదాయములో పెరుగుటచే మొదటినుండియు నేను ఆధ్యాత్మచింతనాపరుడనే. అప్పటికి నావయస్సు 7 లేదా 8 సంవత్సరములు మాత్రమే.

క్రీ.శ.1939 వ సంవత్సరమున నేను విజయనగరం లో IV Form (Now 9th Class) చదువుచున్నప్పటినుండియు Scouting Activities లో పాల్గొనుచు యుండేవాడిని.

1941 లో నేను VI Form i.e. SSLC ( Now 11th Class ) కి వచ్చేక Sri Vizia Rama Scout Group, 1st Vizanagaram Troop, Vizanagaram కి Troop Leader గాను, 1942 లో Intermediate Ist year చదువుచున్నప్పటినుండి The Hindustan District Scout Association, Vizagapatam District cub Master గాను, Quarter Master గాను, కూడా విధులను నిర్వర్తించేవాడిని.

మొదటినుండియు మా తండ్రి గారు నామనస్సులో నాటినట్టిఫలాపేక్షరహిత కర్మాచరణమే నాకు అలవాటు. 1944వ సంవత్సరమున ఉద్యోగములో చేరుటకు నేను ఖర్గపూర్ వెళ్లునపుడు మానాన్నగారు నాకిచ్చిన సలహాలు అందరకును వర్తించును గాన వాటిని ఈ దిగువ పొందుపరచినాను.

1. భగవన్నామ స్మరణ నీ దినచర్యలలో నొకటియని ఎప్పుడును మరచిపోకు. "ప్రవాసేత్రివిక్రమః" అనిచెప్పబడినది గాన దూరదేశమున ఉండబోయే నీవు ప్రతిదినము నిద్రపోయేముందు "ఓం త్రివిక్రమాయనమః" అని 108 సార్లు జపముచేయి. అదేగాక రోజూ నిద్రపోయేముందు జపించదగ్గ మరికొన్ని మంత్రములు గూడ చెప్పినారు.

2. నీపనిని నీవు నిర్భయముతోను, నిష్పక్షపాతముగను చేయి. (Do your duty without fear or favour)

3. నీపనిని నీవు ఇతర ఆలోచనలు లేకుండా చేసుకొంటూపో. అదే భగవదారాధన (Work is worship)

4. ఒకని ముందు మాటలాడలేని దానిని వాని వెనుక ఎప్పుడునూ మాట్లాడకు. (Never talk anything about anybody behind him, what you can't speak before him)

5. ఈ రోజు చేయదగ్గపనిని ఎప్పుడును రేపటికి వాయిదా వేయకు. (Never post pone till tomorrow, what you can do today)

6. నీకు వచ్చిన సొమ్ము కొంచెమైనను రేపటికి ఉంచుకో. చేయజాచి ఎవరినీ ఎప్పుడును అడుగకు. అప్పుఅడిగినవాడు ఇచ్చినవానికి లోకువ.

7. ఆదాయమును బట్టి వ్యయము చేసుకో. ఉన్నగుడ్డను బట్టి కోటును కత్తిరించు

(Cut the coat accordifng to cloth) ఉన్నదానితో తృప్తినొందడము అలవాటుచేసుకో.

8. For want of opportunities everybody is honest. So, better pray God not to give you any opportunities to become dishonest.

పై సలహాలను నేను అప్పటికిని, ఇప్పటికిని, కూడా పాటించుచూ సంతోషముతో నాజీవనయాత్ర కొనసాగించుచున్నాను.

7 లేదా 8 సంవత్సరముల వయసులో నేను మానాన్నగారితో సహా మంత్రపుష్పము మొదలగునవి చదివేవాడిని. 12 సం॥ ల వయసులో నేను యోగాసనములు వేయుటనేర్చుకున్నాను. యోగవ్యాయామము నిరాటంకముగా కొనసాగించుటవలననే ఉద్యోగము చేసిన 38 సం॥ లలోను ఎప్పుడైనను నేను అస్వస్థతకు గురికాలేదు. ఒకప్పుడు శీర్షాసనమును అరగంటసేపు, మయూరాసనమును 15 నిముషములకాలము, వేయగలిగేవాడను. ధ్యానము మాత్రము చేయు చుండెడి సుమారు సంవత్సరమునుండి (క్రీ.శ. 1998 మార్చినుండి) సిద్దాసనమున ఒక ఘంటసేపు ఉండి ధ్యానము కొనసాగించగలిగేవాడిని. మా అమ్మగారు రోజూపారాయణ చేయునప్పుడు విని పురుషసూక్తము, శ్రీ సూక్తము, భూసూక్తము నేర్చుకున్నాను. 1979 నుండి 2 సంవత్సరములకాలము నాకు Dr.K.S. శాస్త్రిగారు (మాస్టర్ ఎక్కిరాల కృష్ణమాచారిగారి తరువాత అంత హోమియో డాక్టరుగా ఇప్పుడు వీరు ప్రసిద్ధినొందియున్నారు). నమకము, చమకను, శీక్షావల్లి, బ్రహ్మానందవల్లి, బృగువల్లీ, చిత్తిపన్నమ్, నారాయణం, నారాయణోపనిషత్, మహాన్యాసములను నేర్పినారు. నాఅంతట నేనే పుస్తకము సహాయముతో మన్యుసూక్తము, నీళాసూక్తము, నేర్చుకున్నాను. నేను రిటైర్ అయినాక 1983-84 లో బ్రహ్మశ్రీ భమిడిపాటి సర్వావధాన్లుగారి వద్ద నక్షత్రేష్టి, నవగ్రహజపం, పంచకాఠకములు, కొన్ని ఆశీర్వచనమంత్రములు, గణానాంత్వాఘనపనస, పర్యాప్త్యా ఘనపనస నేర్చుకున్నాను.

నేను 1944 లో దక్షిణపూర్వరైల్వే (S.E.Rly). యందు జూనియర్ క్లర్కుగాచేరి 1982 యందు సీనియర్ అకౌంట్స్ ఆఫీసరుగా రిటైర్ అయినాను.

1984 లో నాకు చాలా హెచ్చైన రక్తపు ఒత్తిడి (Very High blood pressure) యును, 1985 లో అతితీవ్రమైన గుండెపోటు (Massive attack) యును కలుగుటవలన అప్పటినుండి 5,6 నెలలు పూర్తిగా రెస్టు (Complete bed rest) తీసుకోవలసివచ్చినది. అనంతరము ఇంటినుండి వెలుపలకు రాకుండగనే 1 సంవత్సరము గడుపవలసివచ్చినది.

అప్పటినుండి ఇప్పటివరకు ఔషధములు సేవించుచూ క్రొద్దిగా మాత్రమే అటు ఇటు తిరుగుతున్నాను.

అయితే ఈ యస్వస్థతవలన నాకు మంచియే కలిగినది. (It proved to be a blessing in disguise to me). ఇంటి విషయములు గాని, ప్రాపంచిక విషయములు గాని ఏ మాత్రము పట్టించుకోకుండా, ఏ పనిపాటూలేకుండా ఇంట్లోనే సాధ్యమైనంత తక్కువగా మాట్లాడుతూ ఉండుచుండుట పూర్వాభ్యాసకారణమున గాబోలు నన్ను ఎల్లప్పుడును ఆధ్యాత్మిక చింతనలోనే ఉండేటట్లు చేసింది. ప్రతిదినము 4 పర్యాయములు సోహం మంత్రమును జపించుచూ ప్రాణయామము జేయుట, ఇతర మంత్రములను జపించుట, సద్గ్రంధపఠనము, అట్లుపఠించుచూ నోట్సు వ్రాసుకొనుట, మొదలగు సాధనలలో ఎల్లప్పుడును నిమగ్నమై ఉండేవాడిని.

శ్రీ మద్భగవద్గీతా (తాత్పర్యదీపికా సహితము) శ్రీ భగవద్గీత స్థూలాక్షరీ, గీతామకరందము, శ్రీ మద్భగవద్గీతా గూడార్థదీపిక గీతాభావప్రకాశములను తదేకదీక్షతో పరిశీలించిన మీదట భగవద్గీతకు శంకరభాష్యము చదవాలనిపించింది.

అప్పుడు నాకు "The Bhagvad Gita with the commentary of Sri Sankaracharya translated from the original Sanskrit into English by Sri Alladi Mahadeva Sastry" దొరికింది. దానిని పూర్తిగా చదివి గ్రహించిన మీదట దేవనాగరి లో శ్రీ ఆదిశంకరులు రచించిన భాష్యమునే చదవాలని కుతూహలము నాకు జనించినది.

తరువాత "Srimad Bhagavad Gita Bhasya of Sri Sankaracharya with text in Devanagiri & English rendering - Translation by Dr. A.G.Krishna Warrier" లభించింది. దానిని క్షుణ్ణంగా చదివిగ్రహించిన మీదట శంకరభాష్యమునకు తెలుగు అనువాదమున్నయెడల ఆంధ్రప్రజానీకమంతకును అత్యంత ఉపయుక్తముగా నుండునుకదా! అనిపించింది. వెంటనే శంకర భాష్యమునకు తెలుగు అనువాదమునకు అన్వేషణ మొదలుపెట్టేను. ఎక్కడా దొరకని కారణమున నేనే దేవనాగరిలో నున్న శంకరభాష్యమునకు పైనచెప్పబడిన ఇంగ్లీషు అనువాదముల సహాయముతో తెలుగుభాషలోనికి స్వేఛ్ఛానువాదము చేయనుపక్రమించినాను. అయితే శంకరభాష్యములోని కొన్నికొన్నివాక్యములయొక్కయు, ప్రయోగములయొక్కయు, భావము పూర్తిగా గ్రహించుటకు గాను దశోపనిషత్తులయొక్కయు, బ్రహ్మసూత్రముల యొక్కయు శంకరభాష్యములయనువాదములను, మరికొన్ని ఇతరగ్రంధములను గూడ, విపులముగా చదువుకొనుటయవుసరమనిపించింది.

కనుక ఈ క్రింద ఇచ్చిన గ్రంథములనన్నిటిని వాటివాటి భాష్యములతో సహా క్షుణ్ణముగా చదివితిని.

1) దశోపనిషత్తులు (2) బ్రహ్మసూత్రములు (3) విష్ణుసహస్రనామ స్తోత్రము (4) సాధనపంచకము (5)వివేకచూడామణి (6) ఆత్మభోధ (7) శివానందలహరి (8) సౌందర్యలహరి (9) పతంజలి యోగసూత్రములు (10) మహీపీఠము (అగస్త్యదివ్యజ్ఞానసమాజము - అనకాపల్లి ప్రచురించినది.) 11. Raja Yoga by Swami Vivekananda (12) యోగవ్యాయామశాస్త్రము (13) హఠయోగప్రదీపిక

అనంతరము గీతాశంకరభాష్యమునకు స్వేచ్ఛానువాదమును అవసరమనిపించిన చోట్ల వివరణముతో సహా పూర్తిగావించినాను. అది సుమారు 1200 టావు సైజు పేజీల గ్రంథమయింది. Dr.గోరుగంతు అక్కిభొట్ల శర్మ గారు, M.A., P.H.D. Principal, Sanskrit Dept., Andhra University దయతో నాయనువాదమును సరిచూచుటకు అంగీకరించి తన స్వంతపనులన్నిటిని మానుకొని ద్వితీయాధ్యాయాన్తము వరకు చూచినారు కూడను. కారణాన్తరములవలన దానిని వారిచే పూర్తిగా సరిదిద్దించలేక పోయినాను. అదేగాక అంతపెద్దపుస్తకమును ప్రచురింపజేయుట చాలా వ్యయప్రయాసలతో గూడుకొనిని పని. దానిని ముద్రింపజేయుట నా శక్తికి మించిన పనేమోయనిపించినది.

ఆకారణమువలన మోక్షసాధనము అను శీర్షిక క్రింద భగవద్గీతయందలి భక్తిని గూర్చి భోధించబడిన 90 శ్లోకము యొక్క మూలము మాత్రము శంకర భాష్యానుసార భావతాత్పర్యసహితముగా నొకచోట జతపరచి రచించియున్నాను. దానిని వేరుగా ప్రచురించుయత్నములో నున్నాను.

వద్దిపర్తి కోనంరాజు

# ఉపోద్ఘాతము

॥ బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి॥

(బ్రహ్మమును తెలిసికొనిన వాడు బ్రహ్మయే అగుచున్నాడు)

ఈ సృష్టియందలి ఎన్నిటిని తెలిసికొనినను తెలిసికొనదగినది ఇంకామిగిలియే ఉంటుంది. ఆది మధ్యాన్తరహితుడగు పరబ్రహ్మమును తెలిసికొనినచో ఇక తెలిసికోవలసిన దేదియును మిగిలియుండదు. ఇందుకు ప్రమాణములు

గీత 7-2 "యజ్ఞాత్వానేహభూయో ఽన్యజ్ఞాతవ్యమవ శిష్యతే - దేనిని తెలిసికొనిన పిమ్మట ఈ ప్రపంచమున తెలిసికొనదగినది మరియొకటి యుండదో...."

గీత 13 - 12 "జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి యజ్ఞాత్వాఽమృతమశ్నుతే - దేనిని తెలిసికొనిన పిదప మానవుడు అమృతత్వమును పొందుచున్నాడో ఆ జ్ఞేయవస్తువును విపులముగ జెప్పుచున్నాను."

ముం ఉ 3-2-9 "సయోహవైతత్పరమంబ్రహ్మవేదబ్రహ్మైవభవతి - ఎవడైతే ఆ పరబ్రహ్మ మును తెలిసికొనునో వాడు నిశ్చయముగా ఆ బ్రహ్మమే యగుచున్నాడు."

బ్రహ్మ 1 వ అనువాకం "బ్రహ్మవిదాప్నోతిపరం - బ్రహ్మమును తెలిసినవాడు సర్వోత్తమమైన ఆ బ్రహ్మమును పొందుచున్నాడు."

వివే 126 "యద్విజ్ఞాయనరో బన్ధాన్ముక్తః కైవల్యమశ్నుతే - నరుడు దేనిని తెలిసికొని బంధమునుండి విముక్తుడై కైవల్యమును పొందుచున్నాడో......"

కేన 2 - 3 "అవిజ్ఞాతం విజానీతాం విజ్ఞాతమవిజానతాం ఎవనికి బ్రహ్మస్వరూపమింతే యని నిశ్చయముగా తెలియదో వానికి బ్రహ్మస్వరూపము తెలిసినది. ఎవనికి బ్రహ్మస్వరూపమింతేయని తెలియునో వాడు బ్రహ్మస్వరూపము నెఱుగడు."

శాం. ఉ. ద్వితియోధ్యాయము. "యస్మిన్విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతంభవతి బ్రహ్మమును తెలిసికొనినచో ఈ సమస్తమును తెలిసికొనబడినది యగుచున్నది."

బృ.హ. 4-4-14 "యే ఏ తద్విదురమృతాస్తేభవన్త్యథేతరే దుఃఖమేవాపియన్తి - ఆ పరబ్రహ్మమును మేమైతిమని తెలిసికొనువారు మరణములేని వారై ముక్తులగుచున్నారు. ఇట్లు తెలిసికొనని అజ్ఞానులు జననమరణాది దుఃఖమును పొందుచున్నారు."

స+ ఇతి = నేతి) అనగా ఇదికాదు ఇదికాదు అనువాక్యము చేత సర్వమును నిషేధించగా మిగిలినదే యీ పరమాత్మ లేదా పరబ్రహ్మము లేదా పురుషసూక్తమున చెప్పబడిన పురుషుడు గీత 15 - 18 యందు చెప్పబడిన పురుషోత్తముడు, లేదా భగవానుడు, లేదా పరమేశ్వరుడు. అట్టిపరబ్రహ్మమును తెలిసికొనుటకు మరియొక మార్గము ఆతని సమస్త విభూతి, బలశక్త్యైశ్వర్యాదిగుణ సంపన్నత్వమును, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమును, అనావరణ జ్ఞాన శక్తిత్వమును, తెలిసికొనుటయే. అయితే యీ పరమేశ్వరునికి వర్తించు విభూతులు కోకొల్లలు, అనన్తములు. శ్రీ కృష్ణభగవానుడే గీత 10-19 యందు "నాస్త్యన్తోవిస్తరస్యమే - నా యొక్క విభూతి విస్తారమునకు అన్తము లేదు" అని చెప్పియున్నాడు.

కనుక ఆ పరబ్రహ్మమునకు వర్తించు విభూతులు, గుణగణములు, మొదలగు వానిని తెలుపు కొన్ని విశేషణములతో స్తుతించుచూ "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ - నాకు ఇతర రక్షణ లేదు. నీ వొక్కడవే నాకు రక్ష" అనుచూ వానినే శరణుపొందుచూ ఈ స్తోత్రమును చేయుచున్నాను.

మం: యోవై తాం బ్రహ్మణో వేద అమృతే నావృతాంపురీం।
తస్మై బ్రహ్మచ బ్రహ్మేచ ఆయుః కీర్తింప్రజాందదుః।

తా॥ ఎవడైతే పరబ్రహ్మము యొక్క అమృతముచే నావరించబడి యున్న స్థానమును తెలిసికొనునో వానికి యాపరబ్రహ్మము నిశ్చయముగా పూర్ణారోగ్యముతో గూడుకొనియున్న దీర్ఘాయుష్షును, కీర్తిని, సత్సంతానమును, ప్రసాదించును.



**భార్గవ, చ్యవన, ఆప్నువాన, ఔరవ, జమదగ్నిః పఞ్చా ఋషేయ ప్రవరాన్విత శ్రీవత్సగోత్రోద్భవః ధర్మపత్నీ నర్సమాంబాసహిత వద్దిపర్తి కోనంరాజేశ్వర శర్మాహం క్షేమ, స్థైర్య, వీర్య, విజయ, అభయ, ఆయురారోగ్య, ఐశ్వర్యాభివృద్ధ్యర్థం; ధర్మ, అర్థ, కామ, మోక్ష చతుర్విధ పురుషార్థ సిద్ధ్యర్థం, శ్రౌత, స్మార్త నిత్యకర్మానుష్ఠాన యోగ్యతా సిద్ధ్యర్థం; ఋణానుబన్ధరూపేణ రాగద్వేషాది పునర్జన్మ కారణాన్నివృత్యర్థం; ఏతత్ పరబ్రహ్మ స్తోత్రమహంకరిష్యే. (అని నీటిని ఉంగరపు వ్రేలితో తాకవలెను)**

# పరబ్రహ్మస్తోత్రమ్

1. మాంపాహి "ఓంతత్సత్" ఇతి
సంజ్ఞిత నమః శివాయతే ।
తవ శరణార్థినః మోక్షం
తథ్యమితి సిద్ధంనమః॥

1

2. అనిర్దేశ్యా అమృతవపూ అనన్త బాహో రక్షమాం।

2

అధోక్షజా అనన్తరూపా అప్రమేయా నమోనమః॥

3. అవిజ్ఞాతా అరవిందాక్షా అవిధేయాత్మా పాహిమాం ।

3

అన్తర్యామీ అనవరతా అచిన్త్యా హే నమోనమః॥

4. అచ్యుతా అనన్తశయనా అనాథనాథా రక్షమాం।

4

అచలా హే అన్తకాన్తక అద్వితీయా నమోనమః॥

5. అదృశ్యా అనన్తపురుషా అపరాజిత పాహిమాం।

5

అమేయా అవ్యయా అనన్తా అతీన్ద్రియా నమోనమః॥

6

6. అఖిలాండకోటిబ్రహ్మాణ్డనాయకా అర్ఘ్యా రక్షమాం।
అక్షరా అగ్రాహ్యా అదృశ్యా అప్రమత్తా నమోనమః॥

★ ★ ★

1. అనిర్దేశ్యా! ఇదిఅదియని పరులకు నిర్దేశించి చెప్పశక్యము కాని స్వరూపము క
స్వసంవేద్యస్వరూపము కలవాడా!

2. అధోక్షజా! ఇన్ద్రియములను అధఃకరించి (అణచివైచి) జనించిన
జితేంద్రియులకు ప్రత్యక్షముగునాడా! ఇన్ద్రియజన్య జ్ఞానమును అధఃకరించినవాడ

3. అనవరతా! ఎడతెగని వాడా! నిత్యమును ఉండేవాడా!

4. అన్తకాన్తకా! నాశనము చేసేవాడిని నాశనము చేయువాడా! సర్వమును నశింపజే
కాలము అన్నిటినీమ్రింగుతూ ఉంటే ఆకాలాన్నిమ్రింగేవాడా!

5. అమేయా! ఇంతవాడని చెప్పవీలులేనివాడా!

6. అర్ఘ్యా! పూజ్యతములైన బ్రహ్మాదులచేత అర్చనీయుడా!

ఆదిదేవా ఉ్రశితవత్సలా ఉదికారణ నమోనమః॥

7 8 9 10 11

8. ఇష్టః ఇన్ద్రకర్మా ఈశా ఈశానా ఈశ్వరా రక్షమాం!

12

ఉత్తమ్పురుషా ఉత్తమోత్తమ ఉపేన్ద్రా నమోనమః॥

9. ఊర్ధ్వరేతసా ఊర్ధ్వ శాఖకా ఊర్ధ్వజ్వాలా పాహిమాం।

13

ఊర్ధ్వా ఊర్ధ్వగా ఊర్ధ్వలిఙ్గా ఊర్ధ్వమూర్ధ్నా నమోనమః॥

14 15

10. ఊర్జితా ఊర్ధ్వార్ధరక్షా ఊర్జితశాసనా రక్షమాం।
ఋణ విమోచకా ఏకాత్మా ఏకాకారా నమోనమః॥

11. ఐశ్వర్యప్రదాయకా ఓజసస్వరూపా హే పాహిమాం।

16

ఓజస్తేజోద్యుతిధరా ఓంకార రూపా నమోనమః॥

★ ★ ★

7. ఇష్టః - పరమానందస్వరూపుడగుటచే ప్రియమైనవాడుగనుక

8. ఇన్ద్రకర్మా! ఇన్ద్రునివంటి కర్మ, ఐశ్వర్యరూపమైన కర్మ, కలవాడుగనుక

9. ఈశా! నిరుపాధికమైన ఐశ్వర్యముకలవాడా! సర్వస్వమును స్వంతము చేసుకొన్నవాడా! శక్తిమంతుడా! ప్రభువా!

10. ఈశానా! సర్వభూతనియంతృత్వము కలవాడా!

11. ఈశ్వరా! సర్వశక్తిమత్త్వ ధర్మము కలవాడా! నిరుపాధికమైన ఐశ్వర్యము కలవాడా!

12. ఉపేన్ద్రా! ఉపరి అనగా మీద ఇన్ద్రుడు అనగా ప్రభువు ఇన్ద్రునికి ప్రభువైనవాడా!

13. ఊర్ధ్వగా! సర్వులకునుమీదనున్నవాడా!

14. ఊర్జితా! బలప్రకర్షశాలీ!

15. ఊర్జితశాసనా! పరమేశ్వరుని ఆజ్ఞారూపములైన శ్రుతి, స్మృతులరూపమున అనుల్లంఘనీయమును, ఉత్కృష్టమును అగు శాసనము కలవాడా!

16. ఓజస్తేజోద్యుతిధరా! "ప్రాణబలము శౌర్యాధిగుణములు, దీప్తి", వీనిని ధారణచేసినవాడా! లేదా "ఓజః తేజః" అను నామద్వయముతో, "బలంబలవతామహం" తేజః తేజస్వినామహం అని చెప్పుటవలననూ భగవానుడు ఓజస్స్వరూపుడు, తేజస్స్వరూపుడును అగును. ద్యుతిని అనగా జ్ఞానలక్షణ దీప్తిని ధారణ జేయువాడుగాన ద్యుతిధరుడు అనిచెప్పబడుచున్నాడు. ఓజస్సు-ప్రాణబలము - స్వరూపముగా గలవాడా!

12. 'ఓం' ఇత్యేకాక్షరేణ వేదవేద్యన్తే ప్రోక్తా రక్షమాం!

17

ఔషధా అండజవాహనా ఽంబుజనాభా నమోనమః॥

13. కర్తా కరుణానిధీ కర్మఫలప్రదాతా పాహిమాం!

కమలపత్రాక్షా కరుణాసింధో కృష్ణా నమోనమః॥

18

14. కాలః కాలాతీతా కేశవ ఖగవాహనా రక్షమాం!

గమ్యాగజేంద్రమోక్షదాతా గుణాతీతా నమోనమః॥

19

15. గోవిన్దాఘర్మదీధితిమణ్డలాన్తర్గతా పాహిమాం!

20

ఘనా ఘటనా ఽఘటన వేద్యా చక్రిణీ నమోనమః॥

20 21 22

16. చక్రీ చక్రపాణీ చతురాత్మా చిత్స్వరూపా రక్షమాం!

చిద్ఘనా జగన్నాథా జగన్నియామకా నమోనమః॥

17. జగదీశ్వరా జగదానన్దకారకా హే పాహిమాం।

జగన్నాటకసూత్రధారీ జనేశ్వరా నమోనమః॥



17. ఔషధా! సంసార రోగనివారకత్వమును బట్టి ఔషధరూపుడగు చున్నాడు.

18. ఖగవాహనా! పక్షివాహనా! గరుత్మంతుడు వాహనముగా గలవాడా!

19. ఘర్మదీధితిమండలము అనగా సూర్యమండలము.

20. చక్రిణీ! చక్రీ! లోక రక్షణార్థము మనస్తత్త్వాత్మక మగు సుదర్శన చక్రమున ధరించినవాడా! మరియు తన యాజ్ఞచే పరివర్తనము నొందునట్టి సంసారచక్రము కలవాడా!

21. చతురాత్మా! సృష్టి, స్థితి లయములయందు విభూతులగు నాలుగు మూర్తుల కలవాడా! బ్రహ్మ, దక్షాదిప్రజాపతులు, కాలము, సకలజీవులు ఈ నల్వురు సృష్టిహేతువులగ విభూతులు. విష్ణువు, మన్వాదులు, కాలము, సర్వభూతములు, స్థితి హేతువులగ శ్రీహరివిభూతులు. రుద్రుడు, కాలము, అంతకాదులు, సమస్త జంతువులు ప్రళయ నిమిత్తములైన భగవంతుని విభూతు లని విభూతి చతుష్టయమున వివరింపబడినది. అందుచే చతురాత్మయను నామము పరమేశ్వరుని యందు అన్వర్థము.

23
జగదాధారా జగద్భర్తా జనార్దనా నమోనమః॥
19. జన్మరహితా జగన్నివాసా జితక్రోధా పాహిమాం।
24
జితామిత్రా జ్యోతిర్లిఙ్గా జ్యోతి స్వరూపా నమోనమః॥
25 26
20. ఝషాఙ్గ వతే తత్త్వవేత్తా తన్తువర్ధనా రక్షమాం!
తారా, తారణా, తీర్థకరా, త్వష్టా తేజా నమోనమః॥
27 28
21. త్రిలోకాత్మా త్రిదశాధ్యక్షా త్రిగుణాతీతా పాహిమాం।
29
త్రికాలాధీశా త్రిలోకేశా త్రివిక్రమా నమోనమః॥
22. త్రైలోక్యవాసీ త్రైలోక్యనాథా దయామయా రక్షమాం।
30
దయానిధీ దాతా దామోదరా దేవేశా నమోనమః॥



23. జనార్ధనా! దుర్జనులను హింసించు వాడా! నరకాదులను పొందించువాడా! అభ్యుదయ-నిశ్రేయస-లక్షణమైన పురుషార్థములను గూర్చి జనులచే యాచింపబడువాడా!

24. జితామిత్రా! అంతశ్శత్రువులగు రాగద్వేషాదులు, బహిశ్శత్రువులగు రావణ కుంభకర్ణ శిశుపాలాదులు ఎవరిచే జయింపబడిరో అట్టి పరమాత్మా!

25. ఝషాఙ్గవతే! మత్స్యపు అవయవము కలవాడా! అనగా మత్స్యావతారస్మృతి.

26. తన్తువర్ధనా! శోభనమైన విస్తీర్ణప్రపంచము కలవాడుగాన భగవానుడు 'సుతన్తు' శబ్దవ్యపదేశ్యుడగుచున్నాడు. ఆవిస్తీర్ణమగు ప్రపంచ రూపతన్తువునే వృద్ధిపొందించువాడా! భేదించువాడా!

27. త్రిలోకాత్మా! త్రిలోకములకును అన్తర్యామి యగుటచేత పారమార్థికముగా త్రిలోకములుయును ఆపరమాత్మకంటె భిన్నములు కాకుండుటచేతను, త్రిలోకాత్మాయని యాతడు కీర్తింపబడుచున్నాడు.

28. త్రిదశాధ్యక్షా! జాగ్రత్, స్వప్న, సుషుప్తులు అను మూడు దశలు (అవస్థలు) గుణావేశము చేగలుగును. అట్టియవస్థాత్రయమున కధ్యక్షుడా!

29. త్రివిక్రమా! మూడులోకములలో వ్యాప్తమైన మూడు పాదన్యాసము కలవాడా! త్రిలోకములను త్రివిధముగా వ్యాపించినవాడా!

30. దామోదరా! ఉదరమందు తులసి మాలకలవాడా! లేదా బాల్యమందు తల్లియగు యశోద చేత యుదరమున మాలకట్టబడినవాడా!

23. దేవదేవా దేవాధిదేవా దుష్టశిక్షకా పాహిమాం।
దేశాతీతా నటరాజా నారాయణా హే నమోనమః॥

24. నానావిధాని దివ్యాని నానావర్ణాకృతా రక్షమాం!
31 32
నిత్యా నిష్క్రియా నిర్విశేషా నిరఞ్జనా నమోనమః॥

25. నిష్కామ జనమోక్షప్రదా నిర్గుణా నిత్యా పాహిమాం।
33 34
నిష్కలా నిరూపా నిశ్చలా నిర్వికల్పా నమోనమః॥
35

26. నిరాఖ్యాతా నిర్మలా నియన్తా నీలాకారా రక్షమాం!
పరమపురుషా పరమాత్మా పద్మాక్షా నమోనమః॥

27. పరమేశ్వరా పతితపావనా పవిత్రా పాహిమాం!
36 37
పయోనిధినికేతనా పరమహంసా నమోనమః॥
38

28. పద్మనాభా పరమపావనా పరంధామా రక్షమాం!
పరబ్రహ్మ పరాయణా ప్రజ్ఞానబ్రహ్మ నమోనమః॥

★ ★ ★

31. నిర్విశేషా! విశేషరహితుడా! ధర్మశూన్యుడా! అనగా నెవ్విధమైన ధర్మములు, గుణములు, లేదా లక్షణములు లేనివాడా!

32. నిరఞ్జనా! తమోగుణములేనివాడా! తమస్సూన్యమైనవాడా!

33. నిష్కలా! అవయములు లేనివాడా!

34. నిర్వికల్పా! వికల్ప శూన్యుడా! వికల్పములన్నియు మాయాకల్పితములే గ పరబ్రహ్మము నామరూపాదులు లేనివాడని చెప్పుకొనవచ్చును. లేదా వికల్పమనగా భేద నిర్వికల్పుడనగా భేదశూన్యుడు.

35. నిరాఖ్యాతా! పేరులేనివాడా!

36. పయోనిధి నికేతనా! పాలసముద్రము నివాసముగా గలవాడా!

37. పరమహంసా! సంన్యాసులలో అత్యుత్తమ శ్రేణికి చెందినవాడా!

38. పరంధామా! అన్నింటికంటెను శ్రేష్ఠమైన ఆశ్రయము లేదా స్థానము లేదా రూ

29. ప్రత్యగాత్మా పాపనాశకా పురుషోత్తమా పాహిమాం।
39 40
పుండరీకాక్షా బహుశీర్షా భగవాన్ నమోనమః॥
41 42
30. భవా భక్తజనవత్సలా భూతభావనా రక్షమాం!
భూతభవిష్యద్వర్తమాన నియామకా నమోనమః॥
43
31. మహావిష్ణో మహేశ్వరా మధుసూదనా హే పాహిమాం।
44
మహాతేజా మహాయజ్ఞా మేదినీపతీ నమోనమః॥
45
32. మంగళస్వరూపా మంగళదాయకా మాన్యా రక్షమాం।
మాధవా మాయాధీశా ముకున్దా మురారీ నమోనమః॥
33. యజ్ఞపురుషా యజ్ఞస్వరూపా యజ్ఞమూర్తీ పాహిమాం।
యోగేశ్వరా రసస్వరూపా రసాత్మకా నమోనమః॥

★ ★ ★

39. పుండరీకాక్షా ! తెల్లతామర పూవులవంటి కండ్లు కలవాడా!

40. భగవాన్! సంపూర్ణమైన ఈశ్వరత్వము లేదా నియామకత్వము, వీర్యము (శక్తి) యశస్సు (కీర్తి), శ్రీ(సంపతి), వైరాగ్యము, మోక్షము, ఈ ఆరున్నూ భగములనబడును. (వి.పు..6-5-74) ఈశ్వరత్వాది ఆరు ధర్మములును ఏ వాసుదేవునియందు నిత్యము ప్రతిబన్ధము లేకుండా సంపూర్ణముగా వర్తించుచుండునో మరియు భూతముల యొక్క ఉత్పత్తిని (పుట్టుకను) ప్రలయమును (తనయందులయించుటను) రాబోవు నాగతిని (ఆపత్తును) గతిని, (సంపత్తును లేదా స్థితిని), విద్యను (జ్ఞానమును) అవిద్యను (అజ్ఞానమును) ఎవ్వడెరుగునో అతడే భగవానుడనబడును. (వి.పు.6-5-78) ఉత్పత్త్యాది (సృష్ట్యాది) విషయ విజ్ఞానము కూడా ఎవరికి కలవో అట్టివాసుదేవుడని బిలువబడే వాడే భగవానుడు.

41. భవా ! ఈయన వలన సమస్తము కలుగుచున్నది గాన భవుడు లేదా అంతయును తానేయగు వాడుగాన భవుడు.

42. భూతభావనా! భూతములను సృష్టించుట వలనను, వృద్ధినొందించుట వలనన భూతభావనుడగుచున్నాడు.

43. మధుసూదనా! మధువను రాక్షసుని చంపిన వాడా!

44. మేదినీపతీ! భూమికి పతియైన వాడా!

45. మాన్యా! సర్వేశ్వరుడగుటచేత సర్వులకు మాననీయుడా!

34. రమావల్లభా లక్ష్మీవల్లభా లోకవన్ద్య రక్షమాం!
వటపత్రశయనా వరదాయకా హే నమోనమః॥

46 47

35. వాసుదేవా వాచామగోచా వాయువాహనా పాహిమాం।
వామనా వాంఛితఫలప్రదాయకా వై నమోనమః॥
36. విచిత్రరూపా విరాట్పురుషా విశ్వవ్యాపీ రక్షమాం।
విశ్వతోముఖా విశ్వేశ్వరా విశ్వంభరా నమోనమః॥
37. విశుద్ధాత్మా విశ్వరూపా విశ్వమూర్తీ హే పాహిమాం।
వేదవేద్యా వేదాన్తకృతా వైశ్వానరా నమోనమః॥
38. శతశోధ సహస్రరూపా శశిసూర్యనేత్రా రక్షమాం!
శాన్తిదా శాశ్వతా శాశ్వతధర్మగోప్తా నమోనమః॥

48 49

39. శాన్తా శార్ఙ్గ ధన్వా శిశిరా శిష్టపోషకా పాహిమాం।
శిష్టరక్షకా శివా శ్రీధరా శ్రీనిధీ నమోనమః॥
40. శ్రీమన్నారాయణా శ్రీమన్మహాదేవా శ్రీమాన్ రక్ష మాం!
శ్రీవత్సవక్షా శ్రీవాసా శ్రీహరీ శ్రీశా నమోనమః॥
41. శుద్ధా, శుద్ధ చైతన్య స్వరూపా సర్వేశ్వరా పాహిమాం।

50

సకామజనఫలప్రాపకా సర్వగా నమోనమః॥
42. సర్వకారణ కారణభూతా సర్వవ్యాపీ రక్షమాం!
సర్వభూతాన్తరాత్మా సర్వస్యధాతారా నమోనమః॥

★ ★ ★

46. వాచామగోచా! వాక్కులకు గోచరించనివాడా!

47. వాయువాహనా! ఆవహా, ప్రవహా, అనువహా, సంవహా, వివహా, పరావహ భేదములతో సప్తవిధములైన వాయువులను, భూమి మొదలుకొని ధృవమండల ప్రవర్తింప జేయువాడుగాన లేదా భీషా స్మాద్వాతః పవతే అను శ్రుతిననుసరించి ఆ భయమువలననే వాయువు ప్రవర్తించును. అట్టి వాయువును భూతముల ప్రవర్తింపజేయువాడు గాన

48. శార్ఙ్గ ధన్వా! ఇన్ద్రియాద్యహంకారాత్మకమైన శార్ఙ్గమను ధనుస్సుగలవా

49. శిశిరా! తాపత్రయ సంతప్త చిత్తులకు విశ్రాంతి స్థానమైనవాడా!

50. సర్వగా! సర్వకారణమగుటచే సర్వత్ర వ్యాప్తమైయున్నవాడా!

43. సచ్చిదానందస్వరూపా సదాచిత్స్వరూపా పాహిమాం।
సర్వాభీష్టప్రదాయకా స్వయంప్రకాశా నమోనమః॥

44. సనాతనపురుషా సర్వోత్కృష్టా సర్వజ్ఞా రక్షమాం।
సర్వధర్మపరాయణా సర్వాన్తర్యామీ నమోనమః॥

45. సర్వలోకమహేశ్వరా సత్పరాయణా హోపాహిమాం।
సర్వగసచ్చిదాత్మకా సర్వతోముఖా నమోనమః॥

51 52

46. సత్స్వరూపా సదానందా సంకర్షణా సమా రక్షమాం!
సర్వత్రగా సదసత్పరా సదాంగతీ నమోనమః॥

47. సమస్తచేతన హృదీప్సితదాయకా భోపాహిమాం।
సర్వలోకేశా వాంఛిత ఫలార్థదాతా నమోనమః॥

53 54 55

48. సహస్రజిత్ సహస్రపాత్ సహస్రాక్షా రక్షమాం।

56 57 58

సహస్రమూర్ధా సహస్రాంశూ సహస్రార్చీ నమోనమః॥



51. సంకర్షణా! సంహారకాలమున ప్రజలను ఒక్కసారిగ నాకర్షించువాడా!

52. సమా! సర్వకాలములయందును సర్వవికార రహితుడా! లేదా మా
లక్ష్మీదేవితో గూడనుండువాడా!

53. సహస్రజిత్! సురారి సహస్రములను అనగా అనేకమంది రాక్షసులను యుద్ధవ
జయించు వాడా!

54. సహస్రపాత్! సహస్ర అనగా అనేక పాదములు గలవాడా!

55. సహస్రాక్షా! అక్షి సహస్రము లేదా అక్షసహస్రము అనగా ఇన్ద్రియ సహస్ర
కలవాడా!

56. సహస్రమూర్ధా! సహస్ర అనగా అనేక శిరస్సులు కలవాడా!

57. సహస్రాంశూ! సూర్యమండలాన్తర్గతుడు గాన సహస్రకిరణములు కలవాడా

58. సహస్రార్చీ! దివిసూర్యసహస్రస్య ( గీ 11 - 12) అను గీతావచనానుసా
ఆకాశమందు వేయి సూర్యులయొక్క దీప్తి అనగా అర్చిస్సులు (కాంతులు) కలవా

59 60

49. సామా సాత్వతాంపతీ సాక్షీ స్థావరస్థాణూపాహిమాం।
సిద్ధసాధ్యప్రపూజితా సిద్ధసంకల్పా నమోనమః॥

50. సిద్ధార్థా సిద్ధిసాధనా స్థిరస్వరూపా హే రక్షమాం!
సృష్టిస్థితి లయకారకా సురారీ భో నమోనమః॥

51. సుఖదా సురాధ్యక్షా సులభా సులోచనా పాహిమాం।
సువర్ణవర్ణా సుదర్శనా సురాధ్యక్షా నమోనమః॥

52. సురేశా సూక్ష్మ స్థూలా సోమపా స్తోత్రప్రియా రక్షమాం।

61

హవిర్ధామా హృషీకేశా హిరణ్యగర్భానమోనమః॥

53. క్షరా అక్షరా క్షరాఽ క్షరాతీతా జ్ఞానా పాహిమాం।
జ్ఞానాతీతా జ్ఞానగమ్యా జ్ఞానఘనా హే నమోనమః॥

54. జ్ఞానచక్షుర్నిరీక్షవతే జ్ఞానా జ్ఞేయారక్షమాం!
నమస్తుభ్యం నమస్తుభ్యం నమస్తుభ్యం నమోనమః॥

55. నమస్తే అస్తు భగవన్, విశ్వేశ్వరాయ, మహాదేవాయ,
త్ర్యంబకాయ, త్రిపురాన్తకాయ, త్రికాగ్నికాలాయ,
కాలాగ్నిరుద్రాయ, నీలకంఠాయ, మృత్యుఞ్జయాయ,
సర్వేశ్వరాయ, సదా శివాయ, శ్రీమన్మహాదేవాయ నమోనమః॥



59. సామా! వేదానాం సామవేదోస్మి - ( గీత 10 - 22 ) యందలి భగవద్వచనానుసారము పరమేశ్వరుడు సామవేద స్వరూపుడుగాన

60. సాత్వతాంపతీ! సాత్వతమను తన్త్రమును రచించినవాడు లేదా చెప్పినవాడు అను అర్థములో వ్యాకరణ శాస్త్రానుసారము సాత్వత్ అన్నది త కారాన్తపదమగును అందుచే సాత్వతాం - సాత్వత తన్త్రమునకు చెందినవానికి పతిః యోగక్షేమములను గలుగజేయువాడు గాన

61. హృషీకేశా! హృషీకములు - ఇన్ద్రియములు - వాటికి - ఈశుడు - క్షేత్రజ్ఞరూపుడుగాన హృషీకేశః అనబడును. లేదా ఇన్ద్రియములు ఎవనికి వశమైయున్నవో ఆపరమాత్మ హృషీకేశుడనియు చెప్పవచ్చును. అథవా, సూర్యచన్ద్రరూప సంబద్ధములు. హృష్టములు (జగత్ప్రీతికరములు) అగుకేశములు (రశ్మిలు) కలవాడు గాన పరమాత్మ హృషీకేశుడనియు చెప్పనగును. పరమాత్మ యొక్క నేత్రములగు సూర్యుడును, చంద్రుడును కేశ సంజ్ఞకల కిరణములచేత జగత్తునకు ప్రభోధను (జ్ఞానము, మెలకువ) కలిగించుటచేతను, ఆసూర్యచంద్ర అగ్నిష్టోమ కర్మలచే జగత్తు హర్షము నొందుచుండుట చేతను పరమాత్మకు హృషీకేశ నామము సిద్ధము.

త్వమేవ విద్యాద్రవిణంత్వమేవ।
త్వమేవ సర్వం మమదేవదేవ।। శ్రీమచ్ఛంకరభగవత్పాదవిరచితం

57. శ్లో।। స్వస్తిః ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయేనమార్గేణ మహీంమహీశా
గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాశ్శుఖినోభవన్తు।।

58. శ్లో।। కాలేవర్షతు పర్జన్యః పృథ్వీసశ్యశాలినీం।

62

లోకోయంక్షోభరహితః బ్రాహ్మణాస్సన్తునిర్భయః।।



62. బ్రాహ్మణాః। బ్రాహ్మణునియొక్క స్వభావజనిత కర్మములు - అంతరింద్రియ (మనస్సు) నిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము, తపస్సు, శుచిత్వము, ఓర్పు, ఋజుమార్గప్రవర్తన, శాస్త్రజ్ఞానము అనుభవజ్ఞానమూ (విజ్ఞానము) ఆస్తిక్యము. (గీత 18-42) బ్రాహ్మణ దేహము భోగములననుభవించుటకు కాదు. ఈలోకమున నెన్నియోకష్టము లననుభవించి మరణాంతరమున అనంతసుఖానుభవమునకు (వసిష్ఠస్మృతి) ఏకత్వము, సమత్వము, సత్యము, శీలము, స్థితి, అహింస, ఋజుత్వము, క్రమముగా కర్మములనుండి నివర్తించుట అనువీటితో సమానమైనధనము బ్రాహ్మణునకు లేదు. (మ.భా 12-175-38) ఎవడు దేనిచేతనైనను కప్పబడియుండగలడో, ఎవడు దేనినైనను భుజించియుండగలడో ఎవడు ఎచ్చటనైనను విశ్రమించగలడో వానిని దేవతలు బ్రాహ్మణుడని తెలిసికొందురు. (మ.భా 12-245-12) బ్రాహ్మణుడనగా తానెవరో తెలిసి తనకాళ్ళకు తాను అడ్డంపడకుండా నడిచేవాడు.(Master E.K.)

సూ:- ఇందు 'శాంతి' అనియున్నపదము 'శాన్తి' అనియును; 'మంత్రము' అనియున్న పదము 'మన్త్రము' అనియును గ్రహించదగును

।। సర్వేజనా స్సుఖినోభవన్తు ।।

సమాప్తం



# 1 వ అనుబంధము

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 12-9-1984

## అద్భుత వాస్తవాలు

విశాఖ జిల్లా, ఎలమంచిలి తాలూకాలో సర్వసిద్ధి అనే గ్రామం ఉంది. ఆ ఊరి కరణంగారు వద్దిపర్తి కోనంరాజుగారు. వీరు 1754లో జన్మించి, 1834లో పరమపదించారు. ఎనభైఏళ్ళు పరిపూర్ణాయుర్దాయం అనుభవించి కవిగా, మహా భక్తుడుగా, అద్భుత దివ్య శక్తి సంపన్నుడుగా, ఆ రోజుల్లో కీర్తితులైనారు. గొప్ప రామభక్తులు కోనంరాజుగారు.

ఒకసారి పూరీ జగన్నాధస్వామిని దర్శించడానికి ఈయన ప్రయాణమై పరివారంతో వెళ్లుచుండగా జచన్నాధ క్షేత్రానికి సమీపంలో నరసింహఘాటీ అనే ప్రదేశంలో యాత్ర సుంకం చెల్లించకపోతే ముందుకు పోనిచ్చేది లేదని అధికారు లీయనను నిర్బంధించారు. జగన్నాధస్వామి రథోత్సవం వేళకు అక్కడకు చేరాలని కోనంరాజుగారి తీవ్రమైన కోరిక. పరివారానికీ, తనకూ సరిపడు సుంకం చెల్లించటానికి ఆయన దగ్గర డబ్బులేరు. నిజానికి యాత్రికుల దగ్గర సుంకం వసూలు చేయకూడదు. అది దురధికారుల దౌర్జన్యం.

అప్పుడు కోనంరాజుగారు 'ఓ జగన్నాధ స్వామీ! నీవు కదలవద్దు' అని పద్యాలు చెప్పారు. అక్కడ జగన్నాధంలో రధం కదలలేదు. ఎంత ప్రయత్నించినా ఫలించలేదు. కోనంరాజుగారిని ఇక్కడ విడిచిన తరువాతనే అక్కడ రధం కదిలింది. తరువాత ఆయన స్వామివారిని దర్శించి స్తుతించారు. ఇదంతా ఆ రోజుల్లో ప్రజలు ఆ నోటా ఆ నోటా చెప్పుకున్నారు. ఆనాటి ఇంగ్లీషు దొరల వరకూ ప్రాకింది ఈ సంగతి. మద్రాసులోని ఉన్నత ప్రభుత్వోద్యోగులకూ, క్రైస్తవ మతవ్యాపనం కోసం శ్రమితున్న ఫాదరీ దొరలకూ, ఇదంతా నమ్మశక్యంకాని వింతగా అనిపించింది. జిల్లా కలెక్టర్లు, మిషనరీ దొరలు, కోనంరాజుగారి అమోఘవాక్కు, యోగశక్తులు, దైవభక్తిద్వారా ఆయన ప్రకటించగల మహిమలు, పరీక్షించాలని, 'ఇవి నిజం కావు' అని నిరూపించాలని, ఉబలాటపడ్డారు.

విశాఖపట్నం జిల్లా ఉన్నతాధికారులు, రెవెన్యూ, పోలీసు, న్యాయశాఖల గొప్ప ఉద్యోగులు, ఇంకా కొందరు ఫాదరీలు కోనంరాజుగారి దగ్గరకు వచ్చి 'మీరు మాకేమైనా మీ యోగశక్తుల నిదర్శనం చూపగలగాలి' అని కోరారు. 'శ్రీరాముడి దయ ఉంటే అదెంతపని' అన్నారు కోనంరాజుగారు. మరయితే "మేం చెప్పినట్లు చేయగలరా?' అన్నారు వాళ్ళు. 'ఆ రాముడి దయ' అన్నారు కోనకవిగారు.

'ఏంలేదు మిమ్మల్ని పడవలో మేము అండమాన్ ద్వీపం చేర్చి అక్కడ వదిలేస్తాము. మీరు ఎటువంటి సాధనమూ లేకుండా ఒంటరిగా విశాఖ రేవు తీరాన ఉన్న పోలవరం చేరాలి. మీకిది సాధ్యమా?' అన్నారు. 'ఓహో! లండన్‌దాకా రమ్మన్నా వస్తాను. అది సాధ్యం కాదనే ప్రసక్తే లేదు' అన్నారు కోనకవి. ఈ డాబులు పరీక్షచేయాలని గట్టిగా నిర్ణయించుకున్నారు దొరలు. 'సముద్రంలో మీరు ప్రయణం చేసే మార్గాన్ని మేము ఓడల్లోనూ, ఒడ్డునా కనిపెడుతూనే ఉంటాము' అన్నారు దొరలు. 'మీ ఇష్టం' అన్నారు కవిగారు. అండమాన్ ద్వీపంలో వదిలేశారు కోనంరాజుగారిని.

కార్తీక శుద్ధ ఏకాదశినాడు ఉపవసించి శ్రీరాములవారి మీద పద్యాలు చెప్పి కోనంరాజుగారు సముద్రజలాలపై యోగాసనంతో మఠం వేసుకొని బయలుదేరారు. రేవు పోలవరం చేరుకున్నారు. రేవు పోలవరం దగ్గర ఒడ్డున సాగి వారు, పేరిచర్లవారు, మొదలైన క్షత్రియులు, దొరలు, కలెక్టరులు, మంగళ వాద్యాలతో కోలాహలంగా తమకు ఎదురొచ్చారని, దొరలు కరచాలనం చేసి ఎంతగానో అద్భుత మనస్కులైనారనీ, కోనంరాజుగారు స్వయంగా వ్రాసుకున్నారు. ఆ దొరల్లో ఛార్లెసు ఫిలిప్ బ్రౌన్‌దొరకూడా ఉన్నారని తరువాత తమకెవరో చెప్పారని కోనంరాజుగారు వ్రాశారు. ఈ అండమాన్ నుండి రేవు పోలవరం యోగాద్భుత సముద్ర తరణం కోనకవి పద్యవృత్తాంతంగా వ్రాశారు. దీనిని స్వర్గీయ పురిపండా అప్పలస్వామిగారి నుండి ఈ రచయిత వ్రాసుకున్నారు.

**-అక్కిరాజు రమాపతిరావు.**

# 2వ అనుబంధము

శ్రీ అడిదం రామారావు పంతులు (రిటైర్డ్ సీనియర్ తెలుగు పండితులు, శ్రీ మహారాజావారి కళాశాల, విజయనగరం) గారిచే రచింపబడి విజయనగరం ఆంధ్ర విజ్ఞాన సమితి వారిచే జూన్ 1940న ప్రకాశింపజేయబడిన ద్వితీయ ప్రచురణమగు "విస్మృత కళింగాంధ్రకవులు" ప్రథమ భాగము (95 నుండి 105వ పుట వఱకు) నుండి గ్రహించబడినది.

వడ్డిపర్తి కోనంరాట్కవి
(క్రీ.శ. 1754 - 1834 సం)

ఇతఁడార్వేల నియోగిబ్రాహ్మణుడు. ఆపస్తంభసూత్ర శ్రీవత్సగోత్రజుఁడు. రామరాజ పౌత్రుఁడు. వేంకట తమ్మయా మాత్యుని పుత్రుఁడు. తల్లిపేరు రామాంబ. వీని యగ్రసోదరులు సర్వయ్య, వేంకటేశ్వరులు అనువారలు. కాపురవము విశాఖపట్టణమండలములోని "సర్వసిద్ధి" యనుగ్రామము.

ఆ ఊరు సర్వసిద్ధి ♦ పేరు కోనమరాజు
వడ్డిపర్తివారు ♦ వాస్తవంబు
బ్రాహ్మణుండ నేను ♦ బ్రాబంధికుండనఁ
బరగువాఁడ ధాత్రి ♦ నెఱుఁగువాఁడ.

కోనంరాట్కవి బాల్యము, విద్యాభ్యాసము మొదలగు వాటినిగూర్చి, యేమియుఁ దెలియరాకున్నది. విద్యాబుద్ధులు నేర్చి పెరిఁగి పెద్దవాఁడైనపిదపఁ గులక్రమాగతముగ వచ్చు కరిణీకముఁ జేకొని, పిత్ర్యముగు మూఁడువందల యెకరముల పరిమితిగల నౌఖరీ యినాంభూములవలన వచ్చు నాదాయము చే సుఖముగ జీవయాత్ర గడిపిన ధన్యుఁడు. సాధారణముగా నాంధ్రకవీశ్వరులఁ జెట్టపట్టిన దరిద్రతా దేవత యొక్క కటాక్ష వీక్షములకుఁ గొంతదూరముగఁ దొలఁగినవాఁడగుట చేతనే కవితావృత్తి జీవనాధారముగఁ జేసికొన నగత్యము లేనివాఁడై కాలము గడిపెను. గ్రామాధికారిగానుండియుఁ గవిత్వకళయం దధికాదరము కలవాఁడై, కృషిచేసి, సరసకవిత్వవైభవములను జూపు ప్రబంధరత్నములఁ గావించి, కీర్తికాయుఁడయ్యెను. ఆర్వేలనియోగులగు కుందూరివారి వంశములోని యొకకవి చెప్పిన జమాబందీదండకమువంటి యొక సీసమాలికనె కమిటీ యుత్తర మనుపేర నీకవి స్న॥ 1209 ఫసలీలో జరిగిన యినాం భూముల ఫైసలాకుసంబంధించిన జమాబందీనిగూర్చియు, నాఁటికాలమున మిరాశీదారులు పడిన ప్రవాసకష్టములఁ సీ.

గూర్చియుఁ జెప్పి దానిని జమాబందీసాగించు దొరవారికి వినిపించి తనతోఁబాటు తన మిత్రులగు నితర కరణముల కష్టములఁ దొలఁగించెనని చెప్పుదురు. ఆసీసమాలిక యిచటఁ బొందు పఱుపఁబడినది.

# కమిటీ వృత్తరం

సీసమాలిక :-

బారాస్న నౌనవ ఫసలీనియాదాస్తు పరగణౌ వుప్పలం పక్కినాఁడ
ఫిబిరేవరను తేది భిన్నవో రోజ్సరికి కరణాల భోగట్ట కరుణవినుడి
యేమయా! తాతగారూ! మీకు క్షేమమా మామయ్యగారూ నమస్కృతంబు
పదివేలు పదివేలు భావగా రో! హో! హో! యెప్పుడయా మీరు యిప్పుడీవె
నాయనా! లెస్సనున్నారోయి మీరంత మనవారు కుశలమా? మరిదిగారు
బంధువు లాత్మసంబంధులు మెదలుగా భాషింతురొక కొన్ని భాషణములు
మీబసెక్కడనయ్య! మాబసేటావల వసతి కాకరకాయ వాటమయ్య
జల్లుడాకుల మేత చీఁకటి చెయ్యూత పాలుడప్పి యజీర్తిపాలుసేత
నొకనూతస్నానంబు నొకనూతపానంబు నొకచోట భోజనం బొంటిపూట
కాని కానీ యిట్టికబురులకే మొచ్చె ముందరదారికి మొదలుచెప్పు
మీమధురాలెన్ని? మీయెడభూమెంత? మీవూరు బీడెంత మెట్టుయెంత?
పల్లపుభూమెంత? పదునాలుగేళ్లకు పంటెంత? ఖిర్దెంత? ప్రజలుయెంత?
నాగళ్లనాఖిర్దు నాడెంత? తవులెంత? చెల్లెంత? బాకెంత? శిస్తుయెంత?
సాలుమగ్గాలు కంసాలి దుకాణాలు కోమటంగణములు కొండలెన్ని?
చెరువులునూతులు తరువులుగము లెన్ని? ఇళ్ల వైనంబు పెరళ్ల రీతి
సగ్రామమునకు విశ్వావసాబ్దములగా మేతుసౌమ్యవరకు ఆగతమువకటి
సాధారణాది పరీధావివరకు పండినపంట రాబడికెనుక రెండు
దగప్రమాదీచవెరదల్ కాళయుక్తి సంవత్సరంబుకు తుదవచ్చుఘనము
మూఁడుముద్దత్తులు మూటికియేకట్ట దిసకకుళుత్థాది దినుసుమెట్టు
ఝూడాదరోబస్తు సనధిలరాబడి పంటమిరాసీల పంటరుసుము
~~చాకర్ల పంటయు సకలమురాబడి పంటమారాసీల పంటరుసుము~~
చాకర్ల పంటయు సకలమురాబడి గాముగానావసూల్ కట్టుబళ్లు
పోతులు గేదెలు పొన్నూరునాగళ్లు యెద్దులమందలు యెసగుపెద్ద
నాయలవై నము పాయ కారీమొదల్ మేకలుగొఱ్ఱెల నేకమైన

పూర్వపుమాన్యముల్ తరువాతమాన్యముల్ కొన్నభూములప్రతి గొన్నయట్టి
ఫీరస్తుకల్గిన పారమాళీఖత్తు య్యిస్మెంటుకాగిత మిచ్చినార
కరువులోగడికి లెఖ్ఖలుబోయెపెద్ద కరువులోలెఖ్ఖలు గానరావు
రెండేళ్ల లెఖ్ఖలులేవు నాదగ్గిఱ మూడేళ్ల లెఖ్ఖలు బోయెమాకు
నాలుగేళ్ల విజాడ నాదగ్గఱను లేవు కడగిఅయిదేళ్ల కాకరము లేదు
పదునాలుగేళ్లకు పదపరుచున్నారు యింకాపదేళ్లకు యిస్తునేను
ఝూముప్రొద్దెక్కను శాలికుడా కచేరీకి వస్తున్నావ లేక మాను
తున్నావొజెప్పుము తప్పు జుల్మానాకు కాసుకుగతిలేదు కాపులివరు
ఇదిగోవస్తినటంచు అదిగొవస్తినటంచు చంకలెఖ్ఖగదించి సరవినేఁగి
యీపంచగూర్చుండ నాపంచగూర్చుండ నంతలోపల రవియస్తమింప
చిరచిరలేచి ముందరసాగువారల గూడిడేరాచేరి కొంతసేపు
తాటియాకులువిప్పి తారుమారులు చేసి దీపాలముందర తిరగవేసి

గీ. ఆరుయేడ్నెల్లు వీరు చీకాకుపడిరి
గాన వారల రక్షించికరుణజేసి
శెలవువేగంబొసంగవె సారసాక్ష
వినుతగౌరీశ వుపమాక వేంకటేశ.

**NB :-** ఈమాలిక కేవలము వినోదార్థము వ్రాసిన కారణమున కోనంరాట్కవి సమర్థుఁడయ్యును ఛందోవ్యాకరణాదులను పాటింపలేదని మనమూహింపఁ దగియున్నది. ఆకారణముచేతనే దీనిని నేను యథామాతృకముగాఁ బ్రకటించితిని.

అ.రా.

కోనకవి క్రీ.శ. 1754 సంవత్సరములోఁబుట్టి 80 సంవత్సరములు జీవించి, 1834 సంవత్సరములో స్వర్గస్థుఁడయ్యెను. ఈ కవివరుఁడు తనకవితాశక్తిచే నద్భుతకార్యములొనర్చెనని యొక ప్రసిద్ధిగలదు. దానిని స్థిరపఱచు సమాచారమొకటి నీతని కృతియగు "మహాలక్ష్మి పరిణయము" పీఠికలో నీకవి మునిమనుమలును, ఏతద్గ్రంథ ప్రకాశకులును, అగు శ్రీయుత వీరరాఘవస్వామి పంతులుగారు నుడివియున్నారు. ఆసమాచారమునే యిచట సంగ్రహముగాఁ జెప్పుచున్నాఁడను. కోనంరాట్కవి యొకప్పుడు కొంతపరిజనముతో శ్రీజగన్నాథము యాత్రార్థమై వెళ్లియుండెను. అప్పుఁడని రథోత్సవదినములు. సుంకముచెల్లించినగాని శ్రీస్వామివారి దర్శనము లభ్యముకాకుండెను. అట్టిసుంకముఁ జెల్లింపనిష్టములేనివాఁడై, యతఁడీరీతిని స్వామివారిని స్తుతించుచుఁబద్యములను జెప్పెను.

వద్దిపర్తి కోనంరాట్కవి

మాణిక్యపురపురో మార్గమందున్నాను
గుండలిశయన యటుండు; పోకు!
ఘటాలనరసింహ ఘటిమధ్యావనీ
మండలందున్నానటుండు; పోకు!
నరసింహలోకాధి నానాధ్వమధ్యష్ట
లోర్వియందున్నా నటుండు; పోకు!
నిజపురీంద్రద్యుమ్న నిలయభూతలమునం
దున్నాను వడియటుండుండు; పోకు!

తే. గీ. పోకుపోకు జగన్నాథ పుణ్యమూర్తి
దితిసుత విపక్ష! త్రైలోక్య దీనరక్ష!
పతితపావనబిరుదాంక ! బహుపరాకు
సేవకునిఁ బ్రోవుదయఁజూడు చిత్తగించు.

ఇట్లు కొన్నిపద్యములు చెప్పుసరికి నట్టికవితాప్రభావము గౌరవించి భక్తునిపై స్వామికరుణ పెనో యన, రథమెంత మందిలాగి శ్రమపడుచున్నను గదలక నిలిచిపోయెను. తఁగర్ణాకర్ణిగ నీకవిప్రభావము మహాంతిమొదలగువారువిని, సుంకముగైకొనకయే ాతనిని, ఆతనిపరిజనమును శ్రీస్వామివారి దర్శనము చేయ ననుమతించిరి.

గీ. జగతి నాలుగువర్ణముల్ సమము చేసి
కుడువఁజేసితివౌభళీ! కుడుచువేళ
నేహ్యమిసుమంతయును లేక సహ్యముగను
శ్రీజగన్నాథ! చేసితే చిత్రముగను.

అని చెప్పఁగా రథము యెప్పటియట్లు కదలినడచెనని చెప్పు చున్నారు.

గ్రంధరచనావిషయము :- కోనంరాట్కవి వేంకటేశ్వరో పాఖ్యానము, రతీపరిణయము, శ్రీమహాలక్ష్మీపరిణయము, జానకీరామశతకము మొదలగుకృతులను ించెను. ఈ విషయము శ్రీమహాలక్ష్మీపరిణయమం దిట్లు చెప్పఁబడియున్నది.

ఉ. ఆమహితాన్వయంబున రమాధిపభక్తి జనించి జానకీ
రామకృతుల్ రచించితిని; రైవతపుత్రి వివాహకావ్యమున్
గామితమొప్ప వేంకటనగప్రభు దివ్యచరిత్ర మాసుధా
ధామదివాకరంబుగను ధన్యుఁడ నీధరణీతలంబునన్.

మీఁది మూఁడుప్రబంధములలో నొకటియగు శ్రీమహాలక్ష్మీపరిణయము, ముద్రితమై కతిపయదినములనుండి ప్రచారములోనికి వచ్చియున్నది. ఇది యైదాశ్వాసముల శృంగారరస ప్రబంధము. ఇందలికథ శ్రీలక్ష్మీనారాయణుల వివాహమహోత్సవము. ఇది పద్మపురాణప్రసిద్ధమని కవి యిట్లు మనకుఁదెలిపియున్నాఁడు :-

సీ॥ కైలాసమందు శంకరుఁడద్రికన్యకు
బోధసేయు పురాణగాథలందు
రాణించుపద్మపురాణోక్త కథలలో
నంబుజాలయ వివాహప్రబంధ
మాంధ్రభాషరచించి యస్మత్కులాభీష్ట
దైవమా నరసింహ దేవునకును
కృతిసమర్పింతు ................

కోనంరాట్కవి నిరుపమానసాహితీపటిమయు ననర్గళకవితా ధారయుఁగలవాడని యీకృతియే ఘంటాపథముగఁ జెప్పుచున్నది. కవిత్వము మూఁడుపాళ్లు సంస్కృతము, నొకపాలు తెలుఁగు, గలిగి కర్ణపేయమై యొప్పుచుండును. వ్యాకరణవిరుద్ధములగు ప్రయోగములు విరళముగాఁ గానఁబడుచున్నను, నవిగణింపఁదగినవికావు. అట్టినెరసు లీతనిసుధామాధురీవాగ్ఝరిలో మటుమాయమగుచున్నవి. మొత్తముమీఁద నీమహాలక్ష్మీపరిణయమ్మును 18,19 శతాబ్దములలో వెలువడిన ప్రబంధములలోఁ బ్రసిద్ధివడసియున్నవానిలోఁజేర్చి, యున్నతస్థాన మీయనగునని చెప్పవచ్చును.

కవి యీగ్రంథమును శ్రీసింహాచలనరసింహస్వామికి నంకితమొనర్చెను. కవితాధోరణి తెలియుటకుఁగవికృతములగుగ్రంథములనుండి కొన్ని పద్యముల నిందుఁ బొందుపఱచుచున్నాఁడను.

మ. క్షితి నార్వేలనియోగిపుంగవులలో శ్రీవత్సగోత్రోద్భవుల్
చతురోపాయసమర్థవైభవకళాచాతుర్యవంతుల్ జగ
ద్వితసత్కీర్తికళానిధుల్ సుగుణసందీప్తప్రభావోన్నతుల్
మతిమంతుల్హితకార్యవంతులుమహామంత్రీశ్వరగ్రామణుల్

ఉ. బంగరుమేడలం జలజపాణులు వీణలఁ గేలఁబూని సా
రంగసమాఖ్యరాగ మలరంబలికించినఁ జేరనిల్చు నో
జంగొమరారె విద్రుమనిశాకరకాంతధగద్ధగప్రభా
భంగవిశాలసాల ఘనబంధురచిత్రకురంగజాలముల్.

ఈ పద్యమునుబట్టి కవికి సంగీతమందుఁగూడ నభినివేశము గలదఁ
యూహింపవచ్చును.

చ. మలదొరముద్దుపట్టిమెడమంగళసూత్రము కంపమొంద దు
ర్జ్వలసురవాహినీమణికి సాగదు చంచలజీవనంబు నె
న్నడఁదడబా టొకింతయుఁ గనంబడ దివ్వెలిగుబ్బ తేనికిన్
హలహలమొక్క సారెగగనాంబరుఁడానెడువేళఁజూడఁగన్.

కవి యీపద్యమునందు "ల" "డ" లకుఁ బ్రాసమునమైత్రిఁగూర్చినా

కం. పలుకులు కపురపుమొలకలు
వలపులు క్షణభంగురములు వావులుసున్నల్
నిలుకడలు నీటిబుగ్గలు
అలివేణుల నమ్మఁజూడ రార్యులు జగతిన్ (3. ఆశ్వా)

మ. వరుఁడన్నన్ ధనమన్న సత్యమనిన న్వాత్సల్యమన్నన్ మనో
హరుఁడన్న న్పురమార్థమన్న సుకృతంబన్నన్ తపంబన్న స
ద్గురువన్నన్ వ్రతమన్నఁ గోరికనసంతోషంబనన్ జీవితే
శ్వరుఁడన్నన్ విబుఁడన్న నీకునబలా వైకుంఠుఁడెల్లప్పుడున్.

(5. ఆశ్వా)

చ. సమయమెఱింగి యవ్విభుని సన్నిధికేగి తదీయదివ్య చి
త్తముతెలఁగెల్లఁగాంచి వనితామణుల న్వెలయించువేళ, క
య్యమునకుదూఁకువేళ మృగయారతినొందెడువేళ కోపభా
వము గనువేళమాని, మృదుభాషలవిన్నపమాచరింపుమీ
(శ్రీ వేంకటేశ్వరోపాఖ్యానము, 1. ఆశ్వా)





ప్రతులు లభించుచోటు:

వద్దిపర్తి కోనంరాజు
డోర్ నెం.44-37-30/2,
శ్రీనివాసనగర్, అక్కయ్యపాలెం పోస్టు,
విశాఖపట్నం - 530 016.
ఫోన్ నెం.720446

వెల: రు. 10-00

**Ramya Printers & Binders**
D. No. 43-5-25, Rly. New Colony, Visakhapatnam - 16
: (O) 720298, (R) 541772